

# జెలసీ

నేనూ చలపతిరావూ చాలా స్నేమితులం. బి. ఎ. చదువుతోవుండగా ఒక సాయంత్రం అతాత్తుగా అతనికి వితంతువులమీద ప్రేమ కలిగి, వాళ్ళ కష్టాలమీద కరుణ పుట్టింది. వితంతువును తప్ప పెళ్ళి చేసికోనని పట్టు పట్టాడు. మేనమామ కూతుర్నిస్తామని వస్తే "ముందు వితంతువును కానియ్యి ' అని చీవాట్లు తిన్నాడు.

యల్. టి. చదువుతో, మళ్ళీ మేమిద్దరమూ, ఒక గదిలోనే వున్నాము. ఆ గదివున్న ఇంటి ఆయన కుమారస్వామి. అయన భార్య నవ్వుతో మాకు చదువు సాగక కాలేజీలో ప్రతిరోజా చీవాట్లు. ఆమె దర్శనం యెన్నడో అయేది. ఆ నాడింక ఆమె తప్ప యింక దేనికీ కళ్ళు అంధాలయేవి. చేసుకుంటే అల్లాంటి పిల్లని తప్ప చేసుకోనన్నాడు చలపతిరావు. అటువంటి పిల్లకావాలి, ఆమె వితంతువు ఐవుండాలి, వాడికి పెళ్ళి కావాలంటే. అది చాలా అసంభవంగా తోచింది. ఆ కుమారస్వామిని హత్యచేస్తే తప్ప. కాని ఆమె తనని వలిచి వాళ్ళే వాలాలని మూడో షరతు పెట్టాడు చలపతి. భర్త హంతకుణ్ణి మోహించినట్లు హిందూ దేశ చరిత్రలో నిదర్శనాలు కనబడ్డాయి కాని అవేమీ ఆంధ్రదేశానికి చెందినట్లు లేవు. అందులో ఆ పిల్ల వీడివంక కన్నెత్తి చూడనన్నా చూడటంలేదు.

నాల్గుగేళ్ళు అయింది. కుమారస్వామి భార్యని చలపతిరావు పెళ్ళి చేసుకున్నాడు. అసంభవ మనుకున్న మూడు షరతులూ నెరవేరాయని నాకు రాశాడు చలపతిరావు. కుమారస్వామి పాత భార్యన్నూ, చలపతిరావు కొత్త భార్యా ఐన రాజమ్మ చక్కదనాన్ని తలుచుకుని, పొయ్యదగ్గర చారు తిరగమోత పెట్టుతున్న నా భార్య వంకరదనాన్ని చూసుకుని, ఒక వారం బాధపడ్డాను. తరువాత మరిచిపోయాను.

మూడేళ్ళయింది. బెజవాడ వెళ్ళటం తటస్థించింది నాకు. మూడు రోజులు చలపతిరావు యింట్లోనే బసచేసి, ఆనాటి రాత్రి మెయిలికి పోతానని శలవు తీసుకుని బయలుదేరాను. మెయిలు తప్పింది. స్టేషనులో

పడుకుందామంటే చలి, తిరిగివచ్చి ఆ దంపతుల్ని లేవడమెందుకని వాళ్ళ యింటి ముందున్న చిన్న గేటుదూకి, వరండాలో నా మామూలు మంచము వాల్చుకుని, రైలు సంచిలో దుప్పటితీసి కప్పుకుని, సంచి తలకింద బెట్టుకుని పడుకున్నాను. లోపల గదిలోనించి కంఠాలు వినబడుతున్నాయి. సంభాషణ అంత నిష్ఠూరంగా జరుగుతుందని తెలిసివుంటే ముంధే నేనున్న సంగతి వాళ్ళకి తెలిసేట్టు చేసివుందును. కొంతసేపు విన్న తరవాత నేనున్న సంగతి తెలియ చెయ్యడం దుష్కరమయింది. పోదామంటే చలి.

"మరి అప్పుడు నన్ను బైటి గదిలో చూసేదానివి కదా"-

"ఎప్పుడు?"

"అదే (కష్టంగా) ఆ కుమారస్వామితో వుండేప్పుడు- అప్పుడు.... నువ్వు నన్ను చూశావుకదా, నామీద యిష్టం కలగలేదూ?"

"ఎందుకు కలుగుతుంది? మీరెవరో!"

"అంతేనా! మరి యిప్పుడో?"

"అడుగుతారా?"

"అప్పుడు ప్రేమరానిది యిపుడు మాత్రం వొస్తుందా యేమిటి?"

"ప్రేమించంది, మిమ్మల్నెందుకు పెళ్ళి చేసుకుంటాను?"

"అతను.... ఆ కుమారస్వామి - బతికివున్నపుడే, నిన్ను నాతో రమ్మంటే వచ్చేదానివా?"

"తప్పుకాదూ?"

"మరి యింక నామీద ప్రేమ యేమిటి?

జవాబు లేదు.

"పోనీ, అతన్నెక్కువ ప్రేమించావా, నన్నా!"

"మిమ్మల్నే సందేహమా?"

"అతను నా అంత ప్రేమగా వుండేవాడా, నీమీద?"

"ఆఁ."

"కాని అప్పుడప్పుడు కోప్పడేవాడే?"

"ఆ కోపం యేముందిలేండి!- హాస్యానికి."

(నొచ్చుకున్న కంఠంలో) "ఐతే అతను బతికి వుంటేనే బాగుండు ననుకుంటున్నావా?"



"ఛా."

"ఏం?"

"అప్పుడు మీరెట్లా తెలిసేవారు?"

"నేను తెలియక పోతేనేం? అతనితో బాగానే వుందిగా?"

"కాని, మీ ప్రేమో?"

"అంటే ప్రేమలు నీకు మారుతో వుండాలన్న మాట. నేను చస్తే బాగుంటుందా యిప్పుడు?"

"పోండీ మరీని,"

"చెప్పు."

మాటాడలేదు ఆమె.

"చెప్పమంటే. నేను చావాలనే వుంది. అందుకనే మాటాడవు- చెప్పవేం?"

"పొండి. ఆయనతో యెట్లా వుంటే మీకేమండీ? ప్రతిరాత్రి ఆయన ప్రస్తావన తెచ్చి చంపుతారు. ఆయనేమన్నా దెయ్యమై పట్టాడాయేమిటి మిమ్మల్ని? ఇంత గాఢంగా ప్రేమిస్తున్నానే చాలదూ?"

మాటలు లేవు. ఏడుస్తో వూపిరి పీలుస్తున్న చప్పుడు.

"చూడు. ఇంకెప్పుడు ఆ సంగతి యెత్తనుగాని ఇది వొక్కటి చెప్పు చాలు. నిజం చెప్పాలి. మొదటిరోజు శోభనం గదిలో మొదట అతనేం చేశాడు?"

"ఏమండీ? ఏం చేస్తారేం? మీకు తెలియదా? మీరేం చేశారు?"

"నేనా? నా మొహం, నాకా అదృష్టం కూడాను? చెప్పుమరి?"

"ఎందుకండి అదంతా యిప్పుడు? ఎప్పుడో మరిచిపోయినాను"

"మరిచిపోలేదు. జ్ఞాపకం తెచ్చుకో. నిజం చెప్పు, అబద్ధం చెప్తావా? (గొంతు మార్చి) ఇదొక్కటి చెప్పు. నిద్రపోతాను. ఏం చేశాడు? నువ్వు యిష్టపడ్డావా? చెప్పుదూ? మీ ఇంట్లోనేగా - కుంచవరంలో ఆ యింటి పడమర గదిలో - జ్ఞాపకం వస్తోంది కాదూ?"

"ఏం లేదు. ఏముంది? నే సిగ్గుపడుతూ నుంచున్నాను."

"అప్పటికి నీకు తెలుసా?"

"ఏమిటీ?"

"అబ్బా, నన్ను చంపకు, ఇదే-ఇదంతా."
"నిజం నాకేమీ తెలీదు, అప్పటికి."
"ఆ, తెలీకుండా వుంటుందా యేం?"
"ఎట్లా తెలుస్తుంది? నిజం."
"అప్పుడే నన్నమాట-పాపం, నిన్ను ఏం తెలీనిదాన్ని-వొంటరిగా"
(నవ్వు..............)
"ఎందుకు నవ్వుతావు?"
"ఏం లేదు."
"ఏం లేదూ? చెపుతావా చెప్పవా?"
"ఏం లేదండీ? వొంటరిగా-ఏమిటి? మరి భార్య నైనాక-"
"అవును, ఏం చేశాడు?"
"అబ్బా? నాకు తెలీదు, నిద్ర వొస్తోంది?"
"చెప్పాలి, చెప్పి తీరాలి, నిన్ను నిద్రపోనీను యీ రాత్రి, చెప్పిందాకా?"
"ఆయన లేచివొచ్చి, చెయ్యి పట్టుకుని-"

"వొద్దు-వొద్దు....ఆ కొత్తదనం, ఆ సిగ్గు అదంతా హాయిగా వాడనుభవించాడు - అంతా పాతై నీ కంతా తెలిసి మామూలై పోయిన తరవాత-యిప్పుడు-వాడు అన్నీ తాకి వొదిలేసి మిగిలినవి, ఇదే నా బతుకా? ఛీ, ఛీ. వెధవని-"

"నేను ప్రేమిస్తున్నానుగా?"

"అవునులే, ప్రేమించడమూ, అవీ, అన్నీ, అతను నేర్పాడు నీకు. ఆ చూపులు, ఆ నవ్వు, అన్నీ అతని కోసం నేర్చుకుని, నామీద చూపుతున్నావు. నేను ముద్దు పెట్టుకుంటే, అతను పెట్టుకున్న ముద్దులతో పోల్చుకుంటావు. అవి మొదటివి. కొత్తవి. అవే బాగుండి ఉంటాయి నీకు. అవునా?"

"ఏం చేయమంటారు నన్ను?"

"ఒప్పుకున్నావుగదా నిజమని! ఆహా! నీ ప్రేమంతా అతనిదే. అతన్ని తలచుకుంటో నా మీద చూపుతావు. చీకట్లో అతనినే అనుకుని తృప్తిపడతావు. అవునా?"

"ఛీ?"

"అవునులే నాకు తెలుసు."



"కాదండీ"

"నోరుముయ్యి మాట్లాడకు. కొందరి కులటలకి బతికివున్న పరాయి వాళ్ళమీద ప్రేమ. నీకు చచ్చిన పరాయి వాడిమీద."

"నిజంగా ఆయన జ్ఞాపకమే లేరండీ. మీరు తప్ప యీ హృదయంలో యెవరూ లేరు."

"నిజమా? నిజమా? ఎట్లానమ్మను? మూడేళ్ళలోనే మరచిపోతావా? అబద్ధం ? అయితే మరి నేను చచ్చినా అంతే?"

"ఛా."

"ఛా, ఏమిటి? మరి అతన్ని కూడా ప్రేమించావా? చచ్చిన ఆరోనెలలో నన్ను పెళ్ళాడావా? అంతేగా? నేను చస్తే మళ్ళీ-"

"ఊరుకోండీ."

"మాట్లాడవేం?"

"నాకు తెలీదు. నిద్ర వొస్తోంది, పడుకోనీండి."

"అది ఒంక, చెప్పు ముందు-నిజంగా నామీద ప్రేమేనా?"

"మళ్ళీ మొదలా?"

"వాడు-ఆ కుమారస్వామి."

"పడుకోండీ-ఏమిటండీ, ప్రతి రాత్రీ యీ గోల? మీకేమన్నా మతి చెడిందా? ఆయన ధర్మమా అంటో మీ స్నేహితుడు ఈ మూడు రోజులు వున్నాడు. ఆయన ఉన్నాడని ఊరుకున్నారు. బతికిపోయినాను. రైలుకు వెళ్ళాడో లేదో మొదలుపెట్టారు."

"అతనింకా ఉండాలనే ఉందన్నమాట."

"ఆ!"

"అప్పుడే కన్నేశావన్నమాట."

"ఛీ, నోరు ముయ్యండీ"

"అవును, నేను బతికివుండగానే తరవాత భర్తను సిద్ధం చేసుకుం టున్నావన్నమాట."

"మీకు మతిపోయింది."

"మరి కుమారస్వామి బతికి వుండగానే, నన్ను చూసుకోలా? అట్లానే!"

"నేను మాటాడను."

"ఎందుకు మాటాడుతావు? నిజం చెప్పు-వాడిమీద కన్ను వెయ్యలా? నాకు తెలిసిందిలే. ఎన్నడూ లేనిది, మళ్ళీ మంగళవారం వస్తానన్నాడు. ఓసి దొంగ-ఓసి-ముండా."

"ఛీ, ఊరుకొండి-మీకు పిచ్చి మితిమీరిపోతోంది మరిన్నీ."

"అవును, పిచ్చే - నీకు హృదయం లేదు. నిన్ను చంపినా పాపం లేదు. నీవంటి వాళ్ళు బతికి వుండకూడదసలు - రాక్షసివి. మొగుడు బతికి వుండగానే మొగుణ్ణి చూసుకోడమా? రెండోసారి. ఇంక యేముంది? నన్ను చంపేట్టున్నావే! మాట్లాడవేం? పాపం. ఆ నిర్భాగ్యుణ్ణి, ఆ అమాయకుణ్ణి కుమారస్వామిని చంపావా, నా కోసం? ఆ చంపే వుంటావు. ఎంత ఘాతుకరాలివే!"

ఏడుస్తోంది ఆమె.

"ప్రతి మొగాడితోను-యిట్లా నన్ను కట్టి చంపకపోతే పొమ్మనరాదూ, పోతాను!"

"పోవాలనే చూస్తున్నావూ? వాడిదగ్గరకేనా? పో, పో, పో ముందు"

రెండు దెబ్బల చప్పుడు, ఏడుపు. గడియ తీస్తున్నారు. అమాంతం పక్కమీద వాణ్ణి లేచి చిన్నగేటు దూకి చిన్న వీధుల్లో పడ్డాను. ఒక్కపరుగున రైలు స్టేషను చేరుకున్నాను.

ఎంత నాగరికత, దయ, రెస్పెక్టు గలిగిన మనుష్యులూ, భార్యల దగ్గిర ఇట్లా అవుతారు గావును. చలపతిరావు అంత "నైస్‌మాన్" అట్లా మాట్లాడాడే! నిష్కారణంగా ఈ గదులలో ఎంతెంత ఘోరకృత్యాలు జరుగుతాయో! కోటూ తలగుడ్డ ఇంటికి రాగానే తీసేసినట్టే మానర్సు, సెన్సు, రెస్పెక్టు, అన్నీ తీసి చిలక్కొయ్యకి తగిలిస్తారు. భార్యేగా! పగలంతా స్టేజిమీదవలెనే వేషంలో ఉంటారు. ఆ తెరవెనక నిజస్వరూపంతో తయారవుతారు, ఈ పెద్ద మనుష్యులందరూ. ఏ కోపమో, జెలసీ కామమూ, ఇట్లాంటివి పట్టుకొని ఊపేప్పటికి మనుష్యుల మనుకొని ప్రవర్తించే వారందరూ, కుక్కలూ, కోతులూ, పెద్దపులులూ, ఎలుగుబంట్లుగా మారతారు-ముఖ్యంగా తమ మీద ఆధారపడి, ఇతరమైన దిక్కులేని భార్యలముందూ, పిల్లలముందూ. ఆ మాట అంటే పట్టరాని కోపం.

★ ★ ★

# రామభక్తుడు

శరత్కాలపు వెన్నెలా, పున్నాగపువ్వుల వాసనా, కొంచెం మంచూ అన్నీ కలిసి రైలు బండి కిటికీ నించి నన్ను పలకరించి, దుమ్ముకొట్టిన బల్లమీద నల్లుల సావాసంలో ప్రయాణం చేసే నా అవస్థని వెక్కిరిస్తున్నాయి. కథలతో కాలాన్ని మరిపించే సుబ్బారావు, ఆ సాయంత్రం ఎక్కడ నక్కాడో కనపళ్ళేదు. పోనీ నా పక్కన కూచుని చిన్న పిచ్చి ప్రశ్నలు వేస్తో, అప్పుడప్పుడు వేళ్ళు నా మొహం వంక తిప్పుతో వేళ్ళు నా వేళ్ళలో కలిపి వెన్నెల కాల్చే నా హృదయ బాధని శాంత వరిచేందుకన్నా ఎవరూ లేరు. కొత్త మొహమైనా, సిగ్గునీ, కళ్ళ మెత్తదనాన్నీ, ముసి ముసి నవ్వుల్నీ చూసి సంతోషించేందుకైనా చుట్టూ నిర్మానుష్యం.

"వాక్కణ్ణి,

నా తిప్పు లీశ్వరుడు లేడా?" అని గొణుగుకుంటో కూచున్నాను.

నా ప్రార్థనకి ప్రత్యుత్తరమన్నట్టు నా పెట్టెలోకి జాగర్లమూడి దగ్గర యిద్దరు మనుషులెక్కారు. అందులో ఒకాయన (ఆయనే రామభక్తుడు) మాటల విజృంభణా, వాగ్ధోరణీ, లోపలి ఇంపెటస్ చూచేటప్పటికి, వెన్నెలా పువ్వులూ మనో వ్యాకులతా తెనాలిదాకా మరిచిపోవచ్చు అని సంతోషించి వెన్నెలని కిటికీ వెలపలకి నెట్టి వీపు తిప్పి వాళ్ళ వేపు తిరిగాను. దాని ఫలితం ఈ కథ-రామభక్తుడిది.

"ఎందుకు ఇట్లాంటి గ్రహచారం పట్టిందా అని విచారణ చెయ్యడం ప్రారంభించాను. కారణం లేకండా ఏ పని జరగదని నాకు ప్రబల విశ్వాసం. ఈనాటి పాశ్చాత్య శాస్త్రవేత్తలు తాము కనిపెట్టామని డాబులుకొట్టే మహాసూత్రాన్ని నేను మా అమ్మ ఒళ్ళో వుండగానే నేర్చుకున్నాను. ఈశ్రీరామ భక్తుడి సంసారంలోకి వ్యాధి ప్రవేశించింది. కారణమేమిటి? యముడికైనా చేరరాని ఈ పవిత్ర మందిరంలోకి యీ పాడు రోగం యెట్లా తల దూర్చింది? ఎన్ని గుండెలతో వొచ్చిందో? ఏదో మహత్తరమైన అనాచారం జరిగి వుండాలి. మూడో దినం మధ్యాన్నం దొడ్లో

రేగిచెట్టుకింద నేను ధ్యానంలో వుంగా తెలిసింది-బుద్ధ దేవుడికి బోధి వృక్షం కింద తెలిసినట్లు నాకు తెలీడమేమిటి? ఆ శ్రీరాముడే తెలియచేశాడు. ఎవడి కోసం? భక్తుడికి భృత్యుడయ్యేను. నెత్తిమీద పగటి వేళ గుడ్ల గూబ కూసింది. తెలిసింది. మూడు నెలల నించి రామనామం ద్వారా మాకు బంధువై మా ఇంట్లో వేంచేసి, కాఫీ ఇడ్లీ భోజనమూ చేస్తున్న సింగుగారు, తాను భద్రాద్రి తోవలో కట్టించ తలుచుకున్న సత్రానికి సహాయం చెయ్యమని అనాటి రాత్రి నన్ను ప్రార్థించారు. ఆయన ప్రార్థించడమేమిటి? ఆయన వాక్కు నధిష్టించిన శ్రీరాముడే అడిగించాడు నన్ను, ఆయన ద్వారా, ఈ భక్తుడి సత్తా పరీక్షించాలని. రామభక్తుడెప్పుడూ దరిద్రుడేగా! ఉన్నదంతా యిది వరకే వెదచల్లాడు కోళ్ళకి! కోళ్ళకి అంటే మామూలేగా-మిత్రులకి, స్త్రీలకి- మిగిలిందల్లా దాని నగలే. ఇదివరకే నా ప్రోద్బలం పైని తన నగలన్నీ రామార్పణం చేసుకున్న నా భార్య, ఆ రాత్రి తన ప్రారబ్ధం కొద్దీ, మిగిలిన ఒక పట్టెడా నేను తాకట్టు పెడతానంటే ఒప్పుకోక, "ఒక్క నగ మిగిలింది. అది గూడా తగలేస్తారా?" అని యేడ్చింది. అన్నీ రాముడి కిచ్చిం తరవాత రాముడే దిక్కుగాని, ఆ పట్టెడ తనను రక్షిస్తుందా! రామ భక్తి ఒక్కటే. అది ఏ నా పతిభక్తి? ఈ రెండే పతివ్రతకి భూషణాలన్నాను. అందరూ తన బోసి మెడ చూసి నవ్వుతారంది. నవ్వనీ, వాళ్ళపని రాముడు పట్టిస్తాడన్నాను. తన తల్లిది అంది, తల్లెవరు, తండ్రెవరు, ఇట్లా పడెయ్యి మన్నాను. నా ముందు సాగుతాయా ఆ పిచ్చి సాకులు! అప్పటికీ ఒప్పుకోకపోతే దానికి ఈ ప్రపంచ ఈషణ త్రయాలమీద కాపీనం మళ్ళించి వైరాగ్యపాఠం బోధించాలనే ఉద్దేశ్యంతో సుమా. ఆ పెట్టడని బలవంతంగా లాక్కెళ్ళి, అమ్మి ఆ సింగుగారు అడిగిన సొమ్ము సమర్పించి, మిగిలిన రూపాయలతో తక్కిన రామభక్తులకి కాఫీ హోటల్లో సంతృప్తిని కలిగించాను.

"కాని నగను వెంటనే యివ్వక రామభక్తుణ్ణి విసిగించిన పాపం వృధాపోతుందా? తగిలింది. మూడు రోజులకే దాఖలా తగిలింది. ఈ పెద్ద రోగం దాన్ని పట్టుకుంది. రోగం పట్టుకోవడమేమిటి? కోదండరాముడే పట్టించాడు. దశరథ రాముడు పంపిన రోగానికి రామ జపమే మందు. మూఢులు జ్వరమని, సంధి అని, వాతమని అన్నారు. కాని నిజం సంగతి మనకు తెలుసు. పట్టాభిరామకృప వొక్కటే ఈ లోకంలో మంచి మందు. అది మన దగ్గర కొల్లలుగా పడివుంది. యింకేం భయం.

"సీతారామా, అజ్ఞానంలో చేసింది క్షమించమని నేను రాముణ్ణి ప్రార్థించి, దానినీ అట్లానే వేడుకోమన్నాను. కాని ప్రారబ్ధం మూసుకొస్తే మన మాటలు సాగుతాయా! నేను బయటికి రామదాసు నాటకం చూడ్డానికి వెళ్ళేటప్పటికి యింట్లో మూర్ఖులు యింగ్లీసు డాక్టర్ని తీసుకొచ్చి దాన్ని చూపించారు. వాడది విషజ్వరమని



అభిప్రాయపడి, ఏవో హార్లిక్సులూ అవీ కొని, మంచుగడ్డ కట్టమన్నాట్ట. అన్నం తినకూడదట. కాని ఆయువు లేనివాళ్ళకి హార్లిక్సు ఆయువు నిస్తుందా? అన్నం తిని కాదూ బతికేది? డబ్బు లాగడానికి యీ డాక్టర్లు చెప్పే కబుర్లు అవన్నీ. ఏదో మూర్ఖుల దగ్గర సాగుతాయి కాని వాళ్ళ అబద్ధాలు నాదగ్గిరా? నా పేరువిని గౌరవం వల్ల వుచితంగా వైద్యం చేస్తానన్నాట్ట. ఎవడి కోసం చేస్తాడు వుచితంగా జానకి రాముడు చెవులు పట్టి వొంచి చేయిస్తూ వుంటే! అంతెందుకు నా భక్తి, నా ఘనత వాడి మొహానకొట్టి చేయిస్తోవుంటే! పైకి మాత్రం మేము బీదవారం గనక యేమీ యివ్వనక్కర్లేదు అన్నాట్ట. వెధవ అభిమానం! కాని మందు వుచితంగా ఇచ్చినవాడు, ఆ హార్లిక్సూ వుచితంగానే యివ్వకూడదూ!

"రామభక్తిలేని మ్లేచ్ఛులు తయారుచేసిన మందులు మనకెందుకండీ ఆ మంచుగడ్డ రక్తాన్ని గడ్డ గట్టించదూ? పేగుల్ని తెనెయ్యదూ? చచ్చే వాళ్ళు అందరూ మంచుగడ్డ లేకనేనా చచ్చేది? వున్నదంతా భజనలకీ, భజనపరుల ఖర్చులకీ దానం చేసిన నాకు మంచుగడ్డకి డబ్బెక్కడిది? "నేనే నీకు వైద్యుణ్ణి నీకేం ఫరవాలేదు. నేనున్నాను. అన్నం తిను, నాదీ పూచి. యీ హార్లిక్సులూ వొద్దు, యేమీ వొద్దు" అని అన్నం తినిపించాను పట్టుపట్టి. రాముడికి నైవేద్యం పెట్టి. కాని నా శక్తిలో వుంచా? యెప్పుడు రామ మంత్రంలో నమ్మకం తక్కువై ఆ మాల వైద్యుడికి చూపారో ఆనాడే జబ్బు ఎక్కువయింది. అప్పుడే నా భక్తిలోఈ గీతం రాశాను.

"రామనామామృతము వుండగానె
వదలి పోయెదరు మందు విషములకు
మంచి పచ్చిక బయళ్లు వదలిపోయి
బుదర మేసెదు హరిణపుంజంబులట్లు.

"రామ భజన తీవ్రంగా సాగించాను. జబ్బు కుదరక యేం చేస్తుంది? భార్యకు భర్తే దైవమైనప్పుడు వైద్యుడు కాలేడా? రాముడి అనుగ్రహముంటే చాలదూ? అని దాన్ని నా నామస్మరణ చెయ్యమన్నాను. దానికి పెద్దమ్మ నెత్తి మీదికి వొచ్చి నవ్వింది. రాత్రింబవళ్ళు ఇరవై నాలుగు గంటలూ నేను కష్టపడి చేసే రామనామం దాని చెవికి కఠోరమయిందీ "అబ్బా, కొంచెం వుండురూ" అంది. దాంతో రాముడు అమృతంగా మార్చే అన్నం కాస్తా విషమయింది. సంధి పుట్టింది. యేం చెయ్యను? ఆ అవస్థ చూడలేక పోయినాను. నావల్ల నేరమేముంది? వెంటనే రాముడికి గీతం రాసేశాను.

"యేమి నేరము నా వల్ల కలిగె నీకు

యింతటాపద నాకేల కలిగెనయ్య
చిన్న మిడుతను చేపట్టి కట్టిపెట్టి
పిడుగుతో దాని పొట్టను చీల్చినట్టు."

"రాశానుగా గీతం! రాఘువుడికి మాన్యాలకంటే, గోపురాల కంటే భక్తుడి గీతం ప్రీతి. రాముడిదయ రావడానికి చెయ్యవలసినదంతా చేశాను. తరవాత దాని అదృష్టం.

"ఎంతసేపు దాని పక్కన కూచుంటాను? మరి రామనామ ప్రచారానికి వూళ్ళో కాఫీ హోటళ్ళకి పోవద్దా?

"నేను లేని సమయంచూసి మాఅత్తవారు నాకు తెలీకుండా యేవేవో మందులు పోశారు. పంచుగడ్డ కట్టారు. నాకు వెర్రెత్తి అన్నీ విప్పి పారేసి, ఆ మందుబుడ్లు పడతన్ని వాళ్ళని నాలుగు బూతులు తిట్టి, రామస్మరణ ప్రారంభించాను. భార్య పోతే పోయింది. రాముడిలో విశ్వాసం మానతానా? భార్యపోతే భార్యవొస్తుంది, రాముడుపోతే.....!!!!

"భార్య రామస్వరూపం. అంతా రామమయం. ఈ స్వరూపం జ్వరంతో నశిస్తే రాముడు భక్తుడికి యింకే రూపంలోనో భార్యగా అవతరిస్తాడు. అంతేగా? భార్య లేకండా బతకమనడు కద! తన భక్తుడి కెట్టి లోపమూ కలగనీనని శపథం చేశాడా లేదా మరి?

"రాత్రంతా భక్తులం అదేపనిగా కూచుని-ఆ రాత్రికి మృదంగం, ఢక్కా, తాళాలు, తప్పెట్లు, అన్నీ తెప్పించాను-భజన చేసేటప్పటికి, పొద్దున్న జ్వరం తగ్గింది. మందువల్ల తగ్గిందన్నారు. మూర్ఖులు, ఆ అత్తవారు. నేను పొరబడి నిజమేననుకుని రాముడి శక్తిని సందేహించి, నా చేత్తోనే మందువేశాను. ఇంకేముంది? రాముడికి ఆగ్రహం వచ్చిందనుకున్నాను. కాని, ఆ భక్తవత్సలుడికి, ఆనంద రూపుడికి ఆగ్రహమేమిటి? ఆరాత్రి నిద్రపోతూ వుండగా నాకు శ్రీరాముడు కనపడ్డాడు. "ఒరీ! నీ భార్య నీకు తగిన గృహిణికాదు. దీనిని తీసికొని పోతాను. నువ్వేమీ విచారపడకు. యింతకన్న మంచిదాన్ని నీ కోసం, ఖర్చు పెట్టడానికి డబ్బుతో సహా ప్రసాదిస్తా"నని అంతర్ధాన మయినాడు.

"లేచాను ఆనందంతో నా హృదయం పులకరిస్తోంది. దానివంక చూశాను. రాముడు ఇంకా తీసుకెళ్ళాడో లేదో అని- ఇంకాలేదు. నిద్ర పోతోంది లేపానుగాని, ఒక పట్టున లేస్తుందా జడురాలు, మందమతి! వూయించగా, వూయించగా మూలిగి, బాధపడి, విసుక్కుని, కళ్ళు తెరిచి పిచ్చిగా చూసింది.



"రాముడి శలవయ్యింది ప్రయాణం కట్టు" అన్నాను. పోయేప్రాణికి ముందే చెప్పి వుంచితే మంచిది. రాముడి వుద్దేశ్యం కూడా అదే అయి వుంటుంది. జీవనమంతా దానికి యాజమానినైన నేను, యీ తుదిసహాయం మాత్రం చెయ్యవొద్దా! దాని చూపుచూస్తే నావంటి భక్తధీరుడికి కూడా కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి.

"ఇంకా ఇహలోక వాసనలు వొదల్లేదు.

"ఏం ప్రయాణం?" అంది వణుకుతో.

"నాకు యేడుపు వచ్చింది. కాని యెందరు భార్యలు పోవడంలేదు విచారపడడం ధీరుడి లక్షణమా అని ధైర్యం చెప్పుకుని "పరలోకానికి రామాజ్ఞ అయింది. నువ్వేమీ భయపడకు. యమదూతలు వస్తున్నారు. సరిగ్గా చూడు కనపడుతూనే వుంటారు. యీ పాటికి-పెద్ద కోరలూ, యెర్ర కళ్ళూ, భయంకరమైన.....' ' అని చెప్తున్నాను.

"అబ్బో" అని పెద్దకేక వేసింది.

"ఫరవాలేదు. నిప్పులు కక్కే నీలపు దున్నపోతు మీద నెక్కిన నల్లనివాడు కాలయముడు...."

మళ్ళీ పెద్దగా అరిచింది పిచ్చిది.

"నీకేం భయంలేదు. దిగులూలేదు. రాముడున్నాడు. నేనేమీ లోపం జరగనీను నీకు. పొద్దునే చందనపు చక్కలూ, కర్పూరమూ తెప్పించి సలక్షణంగా దహనం చేయించి ఘనంగా కర్మ చేస్తాను. నా చేతి మీదుగా దాటి పోవడంకన్న నీకేం అదృష్టం కావాలి!"

"నాకు జబ్బు నయంగా వుంది. అదేమిటి అట్లా అంటారు?" అంది వెర్రిది.

"చివరి నిమిషాల్లో అట్లానే వుంటుందిలే"

"డాక్టరు నయమవుతుందన్నాడండీ!"

పెద్దగా నవ్వాను. డాక్టర్! వాడికి కాలం అసన్నమైనప్పుడు వాణ్ణెవరు రక్షిస్తారు! అంత్య సమయం దాపురించిందని నచ్చచెప్పాను.

"నా కొడుకు" అని యేచ్చింది.

"వాడికేం! రాముడే చూసుకుంటాడు. ఇంకా నీ కెందుకు? నీ దారి నువ్వు చూచుకో. అరుగో యమభటులు పుచ్చులు వేస్తున్నారు నీ ప్రాణం లాగడానికి...."

"వొద్దో నాకు వొద్దు! వూరుకోండి. నమస్కారం చేస్తాను. నాకు భయం" అని వణికింది.

"కాని ఇప్పుడే భయమైతే అప్పుడో! ముందిప్పుడే అలవాటు కావాలి" అని అట్లానే బాగా నరకలోకమూ, వై తరణీ, అంతంముందుండే మరణ వేదన, కఫం, అఘ్టపడడమూ, అన్నీ వివరంగా చెప్పాను. ఏడ్చింది. తిట్టింది. లేవబోయింది. కాని ఆమె భర్తను, రక్షణ కర్తను, దైవాన్ని నేను వూరుకుంటానా? నేను ముగించే లోపునే సందిపుట్టి అరిచి "యమదూతలు బాబో యముడు, అడుగో, చస్తున్నా చస్తున్నా. నన్ను కొట్టకండి, కాల్చకండి" అని అరవడం ప్రారంభించింది. చూశారా. రామనామ మహాత్యం ఆ సంధిలో కూడా "అయ్యో నా కొడుకు? మీరిట్లా బైరాగులతో తిరిగి డబ్బంతా తగలబెడతారు. వాడెట్లా బతుకుతాడు? వాడి గతేమిటి? నా పొలముంటే అది కూడా అమ్మితిరి. వాడి బతుకెట్లా?" అని యేడుస్తూంది మూఢురాలు.

"మరునాడు డాక్టరు అతనంతట అతనే వచ్చి మందిస్తానన్నాడు. నేను ఫక్కున నవ్వి, "నీ మందు లెందుకయ్యా?" అన్నాను. లేకపోతే చస్తుందంటాడు. నా భార్య అతనికి కొంచెం బంధువు లెండి.

"యెట్లానూ చస్తుంది. రాముడే చంప తలచుకుంటే నువ్వా నేనూనా బతికించేది? యేదీ చూద్దాము, ఆయువు మూడినవాణ్ణి, నీ మందులన్నీ పోసి ఒక్క నిమిషం ఎక్కువ బ్రతికించు చూద్దాము. నువ్వూ నీమందులూ నిమిత్తమాత్రం. నాకు భార్య నిచ్చిన రాముడే తీసుకు పోతున్నాడు. నాకులేని దిగులు నీ కెందుకయ్యా?" అని అతన్ని తరిమి అప్పుడు చెప్పా ఈ గీతాన్ని-

"రామ రాక్షస గుణభీమా,
నా రాముడు నీవు నా రామయిది
పోయిననేమీ? రాముడుండగను.

"వెంటనే మామూలు ప్రకారం నా భార్యకీ వినిపంచాను. దాంటో శ్లేషలు గమనించమన్నాను. ఆ కొత్త ,నడకా, కొత్త మయూరవృత్త చమత్కారము విని ఆనందించమన్నాను. కాని గురక ప్రారంభించింది. జడురాలికి. ఇట్లాంటి కవికి ఆ మందమతి తగిన భార్య కాదనేగా రాముడు తీసుకు వెడుతున్నాడు. అదిగాక పొలమూ, నగలూలేని ఈ భార్య తన భక్తుడికి యెందుకు? అనుకున్నాడు రాముడు.

"చూశారా నా భక్తి ప్రభావం! అట్లా వుండాలి భక్తుడంటే. భార్య పోనీ, ధనంపోనీ, ఏమి పోయినా, నిశ్చలుడై పరమాత్మలోనే ఐక్యమై, తామరాకు మీది



నీటి బొట్టులాగా గడపాలి కాలాన్ని. నా భార్యని రాముడికి వొప్పచెపుతో-

"గైకొనవయ్యా, కైవల్యానికి
నా అర్ధాంగి యిది
నా నాథుడవు నీవు
సనాథ నాథ!
సనాతన రామా!"

అని ఒక గీతం కాయితం మీద రాసి పసుపు చుక్కలు పెట్టి, దాని చేతులో పెట్టి, ఇది రాముడికి ఇయ్యి, అన్నాను. తెల్లారి లేచి చూస్తే దాని చేతులో కాయితం లేదు. నా గీతం కోసం ఇది చచ్చిందాకా ఆగుతాడా తారక రాముడు? రాత్రికి రాత్రే తీసికెళ్ళి చదువుకున్నాడు.

"ఆ ఉదయంకూడా ధారకం తీసుకొచ్చారు దానికి, ఆ మూఢులు. ఇంకా పైగా ఏదో మందు నాలుగు రూపాయలు పెట్టి కొనుక్కు రమ్మన్నారు. నాకూ దానికి రుణం తీరిన తరువాత ఇంకా మందులెందుకు?

"అది చూడండి. ఇన్నేళ్ళు నా భార్యయై వుండికూడా కొంచెం వైరాగ్యమన్నా లేకుండా, కాపీనపు గుడ్లేసుకుని, జావవంక చూస్తోంది, ఇంకా తాగాలనే! ఈ సంగతి తెలిస్తే రామభక్తుడికి యెంత అపకీర్తి "నీ భార్యకు చెప్పకోలేని వైరాగ్యం మాకు చెప్పవచ్చావా? నీకు భిక్షా దక్షిణా కూడానా?" అంటారు.

ఆ రోజు వంటలు లేవుకదా! భజనకు ప్రాణం వుండవొద్దా అనీ, దాని మనస్సుని ఇహ వాసనల నుంచి తప్పించాలనీ, అదంతా చూస్తూ వుండగానే ఆ జావ నేనే తాగేసి, రామభజన తాళాలతో సహా దాని చెవులో బిగ్గిరగా ప్రారంభించేప్పటికి పావుగంటలో దాని ప్రాణం కడగంటింది. గుడ్లు తేలేసింది. ధైర్యంగా ఈ చెవులోంచి ఆ చెవులోకి తారకనామం అరుస్తూనే వున్నాను. దాని తల్లీ వాళ్ళూ యాడవాలని గొంతులు సవరించుకొని శ్రుతులు చూసుకుంటున్నారు. వీల్లేదన్నాను. అది సమయం కాదన్నాను. యేడ్చారా తంతానన్నాను. కళ్ళు తెరిచి కొడుకును చూపించమంది. "పోయే దానివి నీ కెందుకు? నా భార్యపై ఉండి ఇంకా కొడుకూ మొగుడూ అని యీ లోకాన్ని పట్టుకు యేడిస్తే యెంత అపకీర్తి! పో-పో, రాముడే నీ కొడకు, రాముడే నీ తండ్రి; పో, త్వరగా పో!" అన్నాను. కాని కడపటి వూపిరితో "అబ్బాయి. మాధవుడు" అంది.

"ఒసే, ఇంకా పోవేమే! నీకేం తక్కువయింది? సుఖంగా పదియేళ్లు కాపరం చేశావు. చీరలుకట్టావు, నగలు పెట్టావు. భక్తాగ్రేసరుడు నీ భర్త తన భక్తితో నీకు మోక్షమర్గాం కలిపించి కైవల్యానికి సరాసరి పంపుతూ వుంటే ఇంకా సంకోచిస్తావు, ఓసి పాడుపీనుగా!" అని ధిక్కరించాను. దాంతో ఆశలన్నీ వొదిలి కళ్ళు మూసింది. అప్పుడు చెవులో, "రాముడు కనపడితే నా సంగతి జ్ఞాపకం చెయ్యి. సీతమ్మ తల్లికి నా నమస్కారాలు చెప్పు. కలియుగంలో ధర్మాత్ములు తక్కువైనారను" అన్నాను.

"దాని ప్రాణం పోగానే నా వంటికి కూడా ప్రేమబంధం తప్పింది కాదు. అంత డబ్బునీ, దాని నగలతో సహా నేను దానం చేసిన తరవాత, అప్పుడు కూడా, నాకు తన దైవానికి, భక్తావతంసుడికి, బోజన లోపం కలిగితే నేనుగాని, రాముడుగాని సహించడని వాళ్ళ అన్నల్ని బిచ్చమడిగి యే పావలో తెచ్చి నా కిష్టమయిన దోసకాయ పచ్చడీ, గుమ్మడికాయ పులుసూ చేసిపెట్టేది. ఒక్కసారి యేడుపు వచ్చింది. అందరూ గొల్లుమన్నారు. కాని భక్తపరాయణుడగు శ్రీరాముడు నన్ను ఆ కష్ట సమయంలో వొదులుతాడా? చతుర్భుజుడు, చక్రగదా హస్తుడు, నీలమేఘ వర్ణుడు, నా ముందు సాక్షాత్కరించాడు. నేను నమస్కరించి, సకల కల్యాణగుణాభి రామా, ఖండితకామా, దండన భీమా అని మొదలుపెట్టాను.

ఆయన నా భుజంమీద చెయ్యేసి, నా భార్య శవంమీద పడి యేడ్చే నా మరదల్ని చూసి- "యిదిగో నీ భార్య. భార్య పోయిందని యేడుస్తావేం? అని మాయమైనాడు. రాముడి మాటలు మా అత్తతో చెప్పుదామంటే అది వినేటట్టుందా, కూతురు చచ్చిందనే భ్రమలో చీకటి యేడుపేగాని! చివరికి జట్టుపట్టి పైకిలాగి చెప్పాను. కాని ఆ తప్పుడు ముండ దాన్ని ఇవ్వనంటుంది రాముడంటే దానికేటు లెక్క, మూడురాలికి!

"ఆ కూతుర్ని చేతులారా చంపావు. దీన్నికూడా నీ మొహాన్నే తగలేస్తానా? రామభక్తి అని నిక్షేపమంటి ఐదెకరాల పొలం అమ్మి ఆ తాగుబోతు వెధవలందరికీ పెట్టి తిప్పలు పెట్టావు. పో. పో. దాని నగలన్నీ లాక్కుని, ఆ గంజాయి గాడిద కొడుక్కి భద్రాది ప్రయాణానికని ఇచ్చావు" అని లేచిపోయింది మూఢురాలు. కాని తానియ్యకపోతే మాత్రం రామాజ్ఞ తప్పుతుందా?

మా అత్తకి నా మరదలు ఒక్కతే కూతురు మిగిలింది. ఆమెకి ఇరవై ఎకరాల పొలం, కాసులపేరూ, కడియం వున్నాయి. రాముడి ఆజ్ఞ అయింది. ఇంక విచారమెందుకు ?

★ ★ ★

# పాటకచేరి

ఒకరోజు మధ్యాన్నం అమలాపురం సత్రంలోంచి నలుగురు మనుషులు బయలుదేరారు. అందులో ముందర నడిచే ఆయన, గురువులాగు కనబడుతున్నారు. బంగారం చుట్టిన రుద్రాక్షకాయ మెళ్ళోను,యెండాకాలమైనా బుజంమీద శాలువా, అధికారం సూచించే మొహం మడతలూ ఆయనకి అధ్యక్షత నిస్తున్నాయి. ఇంకొకడు తాంబూరా, పిడేలూ పట్టుకున్నాడు. వాడే శిష్యుడు అయిదేళ్ళనించి సంగీతం నేర్చుకోగా నేర్చుకోగా, పాటకచేరిలో తాళం వెయ్యగా వెయ్యగా గురువుగారు శ్రుతి పెట్టియిస్తే తాంబూరా మీటడం వొచ్చింది యిప్పటికి. ఈ జన్మలోగాని, యింక వచ్చేఅయిదారు జన్మలకుగాని, అతనికిగాని, అతనితో రక్త సంబంధమున్న యింకెవరికిగాని సంగీతం రాదని గురువుకి తెలుసు, శిష్యుడికీ తెలుసు. కాని రోజూ గురువూ, అతను సంగీతం నేర్పుతున్నట్టూ, నేర్చుకుంటున్నట్టూ ఒక గంట నాటకమాడి సంతోషిస్తో వుంటారు. అదిగాక యీ శిష్యుడు తెల్లారకట్ట నాలిగింటికేలేచి సాధన చేస్తోవుంటే, చుట్టుపక్కల కుక్కలు కుయ్యో మొర్రో అని శ్రుతి కలిపి అరిచి అందరి నిద్రనీ చెడగొట్టేవి. వూళ్లో పెద్దమనుషులు కొందరు చేరి, అతనికి సిఫారసుచేసి, పొరుగూరులో కరిణీకం యిప్పిస్తామన్నారుగాని, అతను సంగీతం వొదిలిపెట్టడానికి వొప్పుకోలేదు. మూడో ఆయన చంకలో మద్దెల పెట్టుకున్నాడు. నాలుగో ఆయన వూరికే చేతులు జోడించుకుని వెంట నడుస్తున్నాడు. అతనికి మాత్రం ఒక కోటు, దానికి మూడుజేబులూ వున్నాయి. ఆయనకీ, సంగీతానికి సంబంధం యేమీలేదు. అయినా వీళ్ళ వెంబడి అప్పులవాడిమల్లే తిరుగుతో వుంటాడు పాట కచేరీల్లో తలవొకటే వూయిస్తాడు. అప్పుడప్పుడు పరవశత్వం యెక్కువై, చుట్టుపక్కల వాళ్ళమీద దొల్లడం, ఉన్నట్టుండి తెలియని వాళ్ళ వీపుమీద తటాలున చరచడం, యెవరన్నా సంగీతం వినకుండా మాట్లాడుతో వుంటే, వాళ్ళకంటె బిగ్గిరిగా అరవడం ఈయన దుర్గుణాల్లో ముఖ్యమైనవి. ఒక సభలో

డిస్టిక్టకలెక్టరుగారి వీపుమీద చురుక్కున కొట్టి, "బలేబలే" అనేప్పటికి ఆయన అదిరిపడి "పోలీసులు, పోలీసులు" అని కేకలేశాడు. ఈ పనిలేని ఆయన యెక్కడివాడో, యెందుకిట్టా వీళ్ళతో తిరుగుతాడో యెవరికీ తెలీదు.

వీళ్ళు మెల్లిగా నడుచుకుంటో వెళ్ళి టవునుహాలు చేరుకున్నారు. ఒకరూపాయి, రెండు రూపాయలూ రేట్లుపెట్టి, వీళ్ళ పాటకచేరి ఆవాళ. అప్పుడు నాలుగున్నరయింది. ఈ నలుగురూ ప్లాటుఫారమెక్కి, శ్రుతి చేసుకుంటున్నారు. అయిదన్నరయింది. వెనక ఒకరూ, ముందు ఇద్దరూ కూచుని వున్నారు. శిష్యుడువెళ్ళి బయట చూశాడు. ఒకరూ కనపడలేదు. ఆరున్నరదాకా, ఆ ఫిడేలూ, మద్దెలా ముందుపెట్టుకు కూర్చున్నారు. ఇంకా ఆరుగురు వచ్చారు, పావుగంట కొకరు చొప్పున. ఈ లోపల యిదివరుకు వొచ్చిన వాళ్ళల్లో వొకరు విసుగెత్తి తిట్టుకొంటో వెళ్ళిపోయినారు. గాసు లైట్లు నాలుగు వచ్చాయి ప్రేక్షకుల్లో వొకరు "పాడుతో వుంటే విని చాలామంది వొస్తారు. ప్రారంభించండి' అన్నారు. మొదట భైరవి వర్ణం. అయిదారు నిమిషాలు పాడారు. ఇద్దరు ముందుకూచున్నవాళ్ళు వెళ్ళిపోయినారు. పావుగంటలో ఇద్దరు గాఢ నిద్రపోయినారు. ఒకరిమీదికి ఒకకరు వొరిగి, యింకొకరు ఆవలిస్తున్నాడు. ఇంకోముసలాయన విసుక్కుంటూ గొణుక్కుంటూ కూచున్నాడు. నల్లకోటూ, పచ్చ టైవేసుకున్న ఇంకో పెద్ద మనిషి తన భార్యపోయిన సాయంత్రం జ్ఞాపకం తెచ్చుకొని, తన వంటరి తనానికి తనే దిగులువడుతో కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నాడు. ఇంకా యిద్దరు ఒకరి మొహాలు ఒకరు చూసుకుని, నవ్వుతో బైటికి పరిగెత్తారు. గురువు గారు సంగీతం ఆపి, ఫిడేలు ముందు పెట్టారు. నలుగురిలో పనిలేని ఆయన లేచి.

"ఈ వూలోళ్ళ యెవరికీ సంగీతంమీద అభిమానం లేనట్టుంది. ఇటువంటి అద్వితీయులైన విద్వాంసులు వొస్తే వినడానికి యే నలుగురో వొచ్చారు. ఇట్లాంటి సంగీతం వినే అదృష్టం ఈ జన్మలో మళ్ళీ తటస్థిస్తుందా? వొచ్చిన వాళ్ళు కూడా సంగీతం అర్థమయే వాళ్ళలాగు లేరు. మీ ఖర్మం" అన్నాడు.

నల్ల కోటాయన లేచి చాలా విచారంతో, యేడుస్తున్న కంఠంతో, కన్నీళ్ళు తుడుచుకుంటో "కచేరి అయిపోయిందా?" అని అడిగాడు.

"అయితే మా టిక్కెట్ల డబ్బు ఇచ్చెయ్యండి, పోతా"మని ఆవలించే ఆయన అన్నారు.

"ఇచ్చిన డబ్బు తిరిగి ఇస్తారా?" అన్నాడు పనిలేని ఆయన.



"అయితే పాడండి" అన్నాడు, పుష్యరాగాల అంటుజోళ్ళ కోమటి. వూరివారందరూ వొస్తారనీ, తన సంగీతాభిలాషా, రసికత్వమూ చూస్తారనీ, రెండు రూపాయలుపెట్టి టిక్కెట్టుకొని వచ్చాడు. లెఖ్ఖవేసి చూస్తే అప్పటికి అణన్నర సంగీతమన్నా కాలేదు. అతని తమ్ముడి పెళ్ళికి పదిహేను రూపాయలిచ్చి, నాలుగు గంటలసేపు పాడించారు, ఒక దురదృష్టవంతుడి చేత.

పనిలేని ఆయన గురువగారివంక భక్తితో చూశాడు.

"చెవిటివాళ్ళకీ, దున్నపోతుకన్నా నా సంగీతం పాడతాగాని, ఇక్కడ నా ముందు వీళ్ళున్నంతసేపూ ఫిడేలుమీద చెయి వెయ్యను" అన్నాడు గురువు.

శిష్యుడు మాత్రం, ఆపాలో లేదో తెలియక, తాంబూరా మీటుతోనే వున్నాడు. దాంతో వాళ్ళకి కోపమొచ్చి "మా డబ్బు మాకియ్యండి" అని నలుగురూ అరిచారు. నిద్రపోయిన వాళ్ళలో ఒకరు ఈ అరుపులు వినిలేచి, సంగీతానికి తలవూయించడం మొదలుపెట్టాడు. పనిలేని ఆయన గురువుగారి అనుజ్ఞ తీసుకొని యెవరి డబ్బువాళ్ళకి ఇచ్చేసి, "ఇంకపొండి" అన్నాడు. వాళ్ళు ఆనిద్రపోయే ఆయన్ని వూయించి లేపుకొని తీసుకు పోతున్నారు. ఆయన "నాకు ఒకటే పీడకలలు వొచ్చాయి. ఇంటి దగ్గిరికి వెళ్ళడమంటే భయమేస్తోంది" అంటున్నాడు. తలతిప్పే ఆయన నడుస్తున్నా సగం నిద్దట్లో "వెంకి ఎందుకే అట్లా తిడతావు?" అంటున్నాడు.

## 2

టిక్కట్ల డబ్బు వాపసు చేస్తున్నారని తెలిసి సగంలో వెళ్ళిపోయిన వాళ్ళు కొంత సేపట్లో తిరిగి వొచ్చారు. పాట జోరుగా వినపడుతోంది. హాలు తలుపులూ, కిటికీలూ బార్లా తీసివున్నాయి. లోపల నాలుగు మూలలా నాలుగు గాసులైట్లు తెల్లగా వెలుగుతున్నాయి. ప్లాటు ఫారంమీద గురువు గారు పాడుతో ఫిడేలు గిరగిర వాయించేస్తున్నారు. శిష్యుడు కునికిపాట్లు పడుతున్నాడు; గాని వేళ్ళు తాంబూర తీగెలమీద కదులుతోనే వున్నాయి. అయినా యెప్పుడు గురువుగారి వెనకాలే తాంబూరా, అతనూ మీద దొల్లుతారో అని చూసేవాళ్ళకి భయంగా వుంది. మద్దెల అతను చేతులు కనపడకుండా బాదేస్తున్నాడు. కొంచెం వేగం తగ్గినప్పుడు మాత్రం, ఆ జుట్టు ముడి, మొహంచుట్టూ పడడంచేత, నాటకంలో హిరణ్యాక శివుడిలాగు కనపడతాడు; పనిలేని ఆయన తల అతివేగంగా వూయించాడు. తలలేని మొండెంవలె చూసేవాళ్ళకి బెదురు కలుగుతోంది. వాళ్ళ ముందు కుర్చీల్లోనూ బెంచీలమీద

ఒక్కరూలేరు. ఒక పిచికమాత్రం దూలం తొర్రలోంచి తల పైయకెత్తి బెదురుతో చూస్తోంది. ఒక గబ్బిలం గుండెలూ రెక్కలూ కొట్టుకొంటో ఆ శబ్దం నించీ, వెలుతురు నించీ తప్పించుకోలేక తడుములాడుతోంది. ఈ వొచ్చినవాళ్ళు యేం చెయ్యడానికీ తోచక నుంచున్నారు. ఒకడు ధైర్యంచేసి దగ్గాడు; కాళ్ళు చరిచాడు; "యామండోయ్" అని అరిచాడు. వాడి గొంతుకు శబ్దం వాడికే వినపడలేదు. దానితో వాడికి భయంపుట్టి పక్కనున్న వాడి నడుం కావిలించుకొన్నాడు. వెనకనున్న జక్కుల కుర్రవాడు ధైర్యంచేసి ముందుకువచ్చి, తలలేని ఆయన జబ్బ పట్టుకుని వూయించాడు. రెండో చెయ్యి కుర్రాడి చెయ్యిని లాగేసిందిగాని, తల మాత్రం కనపడనేలేదు. తల ఆ పైన యెక్కడో వుండాలని వూహించి చేతులడ్డం పెట్టి పట్టుకున్నాడు. అప్పుడా పనిలేని ఆయన కళ్ళు తెరిచి, కలలోంచి మేలుకున్న వాడిమల్లే నిదానించి అయిదు నిమిషాలు చూసి.

"ఏమిటి?" అని అడిగాడు మెల్లిగా.

"మా టిక్కట్ల డబ్బు" అన్నారు.

ఒక నిమిషమైనా మాట్లాడానికి జీవితంలో వ్యవధి లేనట్లు, తన రొంటివున్న రూపాయల సంచి వాళ్ళమీద పారేసి, మళ్ళీ తల కనబడకుండా తిప్పేస్తున్నాడు. యెవరి డబ్బు వాళ్ళు తీసుకుని, మిగిలింది కూడా సమానంగా పంచుకుని, అర్ధరూపాయి మిగిలితే దాన్ని మార్చుకుందామని వుత్తసంచీ అక్కడ పారేసి వాళ్ళు వెళ్ళిపోయినారు.

ఫిడేలు కమాను యెగిరిపోతోంది. మద్దెల మోగిపోతోంది. తల తిరిగిపోతోంది. గాసులైట్లు వెలిగిపోతున్నాయి. సంగీత మాధుర్యం టౌను హాలు చుట్టూ వున్న యిసుక పర్రలో యింకిపోతోంది. వూరు నిశ్చితంగా నిద్రపోతోంది. శిష్యుడు నిద్రపోతున్నా వేళ్ళు కదులుతోనే వున్నాయి. క్లబ్బు జమాను తలుపు ముయ్యటానికి వచ్చి, ఏమీ తోచక, నుంచుని నుంచుని అట్లానే తలుపు పక్కన నిద్రపోయినాడు.

తెల్లారకట్ట మూడున్నరకి ధన్యాసి రాగం మొదలుపెట్టారు. కోళ్ళూ కాకులూ భయపడుతో కూశాయి. చల్లగాలి చెమట పట్టిన వారి వొళ్ళకి తగిలింది. వెలుతురు సందేహిస్తో లోపలికి గాసులైట్ల మీదికి పాకింది. తలుపు ముందు ఒక గొల్ల పిల్లవాడు వొచ్చి నుంచుని తదేక ధ్యానంగా వింటున్నాడు. ఒక నల్ల మచ్చల ఆవూ, దూడా అతని వెనక నుంచున్నాయి చెవులు



నిక్కపొడుకొని వింటో. "నిన్ను చూచి ధన్యుడైతి" అనే కీర్తన యెత్తుకుని గురువుగారు ప్లాట్ ఫారం మీద నుంచి లేచారు. తక్కిన యిద్దరూ వెనక లేచారు. శిష్యుడికి మెళుకువ రాలేదు. పాడుతో వెళ్ళి ఆ గోవుకీ, పిల్లవాడికి ప్రదక్షణం చేస్తో తిరిగారు. నిద్రపోయే లైట్ల మనిషి ఈ గోలకి లేచి ఆశ్చర్యంతో క్లబ్బు జమాను వొంక బెదిరి బెదిరి చూస్తున్నాడు. యేదన్నా ఆపద తటస్థిస్తే దాక్కునేందుకు మంచి చోటేదా అని చూస్తున్నట్లున్నాడు. గాసు లైట్లవాడు పని లేని ఆయన్ని డబ్బడిగాడు. ఆయన తన స్వంతం యెనిమిది రూపాయలు యిచ్చాడు. క్లబ్బు బంట్రోతు అద్దె అడిగాడు. పనిలేని ఆయన జేబులు తడుముకుని తెల్లబోయినాడు. పాడుతోనే గురువుగారు కోపంతో మెళ్ళో బంగారు రుద్రాక్ష తెంప చూశారు కాని అది రాలేదు. మద్దెలాయన ఆయన చెయ్యి ఆపి తన వేలి బంగారు వుంగరం తీసి క్లబ్బు వాడి చేతిలో పెట్టాడు. అందరూ పాడుతో వూళ్ళోకి బయలుదేరారు. క్లబ్బు జవాను తెల్లబోయి వాళ్ళ వంక చూస్తోనుంచున్నాడు.

## 3

పాటకచేరీ వాళ్ళు మార్కెట్టు దగ్గిరికి వెళ్లి మధ్య నుంచుని పాడడం ఆరంభించారు. పెద్ద గుంపు పోగయింది. గురువుగారు,

సంగీత జ్ఞాన విహీనులకు మోక్షము కలదా?" అని యెత్తుకొని, ఆవేశంతో వూగిపోతున్నారు. పిచ్చివాడని అందరూ జాలితో తలలు వూయించారు. యెండ యెక్కింది అయిదేసి నిమిషాలు విని పాతవారు వెడుతో వుంటే, కొత్తవారు వొస్తున్నారు. పదకొండింటికి వినడానికి వొక్కరూలేరు. దగ్గిర వున్న గంపల వాళ్ళు కూడా చాలా దూరంగా జరిగిపోయినారు. పాడుతూనే సత్రం దోవ పట్టారు. సత్రానికి వెళ్ళి పాట ఆపి, దేహాలు గోడకి జారేశారు. అలిసిపోయినారు. నిద్రలేదు. నిన్న మధ్యాహ్నాం చేసిన భోజనం, కడుపులు మాడుతున్నాయి. ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. అందరూ పనిలేని ఆయన మొహంకేసి చూచారు. ఆయన కన్నీరుతో తలపంచుకున్నాడు. ఇంత వరకూ ఆ పూటకి వుడకేసుకోడానికి బియ్యం లేని గతి పట్టలేదు, ఆవాళదాకా. అతని దిగులు చూసి గురువుగారు చిరునవ్వు నవ్వి,

"స్నానం చేస్తే మనకి ఈ మత్తు వదులుతుంది రండి" అని లేచారు.

దోవలో పనిలేని ఆయన "మరి యీవాళ భోజనం?" అంటున్నాడు.

గురువుగారు అతన్ని చూసి నవ్వి "నీదు చరణములే గతి యని" అని మెల్లిగా పాడారు.

పనిలేని ఆయన "అన్న వస్త్రముల కేమి గతియని యెన్నడైన నిన్నడిగినానా" అని గార్ధభ స్వరంతో పాట లాగు అన్నాడు.

"పాల ముంచినా. నీట ముంచినా, పాదములే గతి" అని పాడారు శిష్యుడు గారు.

అతన్ని వీపుమీద తట్టి, "ఇప్పుడు ముందు నీట మునిగేది నిజం" అన్నాడు మద్దెల ఆయన.

"తరవాత పాల మునిగేదీ నిజమే" అని గురువుగారు అంటో వుండగానే, వెనక యెవరో పిలుస్తున్నట్టు వినపడ్డది. ఆగారు-ఒక ముసలి ఆమే, ఆమె నౌకరూ గావును రొజుకుంటోవచ్చారు. ఆమె గురువుగారి పాదాలకి ఆ రోడ్డు మీదనే నమస్కారం చేసి,

"తమ పాద ధూళి చేత నా ఇల్లు ఒక్కసారి పవిత్రం చెయ్యాలి" అని ప్రాధేయ పడ్డది. అందరూ తెల్లబోయి, ఇదేదో వేళాకోళ మనుకుని, సందేహంతో చూస్తున్నారు.

"సంగతంతా తరవాత మనవి చేసుకుంటా. పొద్దెక్కింది. అలసిపోయి వున్నారు. రండి" అంది.

భక్తితో పొంగే ఆమె కంఠం విని, కళ్లు చూసేటప్పటికి వాళ్ళ మొహాలు విప్పారాయి.

"మధ్యాన్నంనించి తప్పకుండా వస్తాము మరి ఇప్పుడు స్నానం కాలేదు. భోజనం...." అనేటప్పటికి డొక్క లోతుకు పీక్కుపోయిన శిష్యుడికి కళ్ళ నీళ్ళు తిరిగాయి. గురువుగారు అప్పుడే మళ్ళీ వెళ్ళి ఆమె ఇంటిలో కచేరి మొదలు పెడతారు గావునని అతని గుండెలు గబ గబ లాడాయి.

"స్నానానికి వేన్నీళ్ళు సిద్ధంగా వున్నాయి. ఈ లోపున పంటలవుతాయి. ఇంక మీరు మాటాడక రండి. మీకు దాసులు, అర్చకులు యెక్కడంటే అక్కడే దొరుకుతారు. పూజచేసి ధన్యతను పొందడానికి మీ వంటి మహాత్ములు నా కెక్కడ దొరుకుతా"రంది.

నలుగురిలో ఇద్దరు బ్రాహ్మలు, ఒకడు నాయుడు .... సందేహించాడు. ఆకలి మాత్రం పీకుతోంది.



"సందేహించకండి. బ్రాహ్మలే పంట చేస్తారు. రండి" అంది.

శిష్యుడి మొహంలో నురుగులాగ చొంగ బయలుదేరింది. డమ డమా కొట్టడానికీ మద్దెలు వెతుక్కున్నాడు. గురువుగారు,

"నీ నామ రూపములకు నిత్యాజయ
మంగళం" అనుకుంటో నడిచారు.

## 4

ఆమె వాళ్ళనో పెద్ద మేడలోకి తీసుకెళ్లింది. నలుగురికీ సలక్షణంగా తలంట్లు పోయించి, కట్టుకోడానికి పెద్ద పెద్ద బనారసు బట్టలు ఇచ్చారు. అందమైన సావిట్లో, వెండిచెంబులు పెట్టి, అరిటాకులు పీటలు ముందువేసి సిద్ధంగా వున్నాయి. పిండి వంటలతో కూడా మద్దెలయ్య పెరుగు అన్నం సగం తింటో పీట మీద పడిపోయినాడు. మేడ మీద పువ్వుల తొట్ల మధ్య, చల్లగాలిలో మడత మంచాలమీద, తెల్లని దుప్పట్లు పరచి వాటిమీద వాళ్ళని పడుకోమన్నారు. గురువు గారికి కాళ్ళూ, మద్దెలయ్యకి చేతులూ నౌకర్లు పడుతున్నారు. నా "మెడకాయి సంగతి యెవరికీ తెలీదా" అనుకున్నాడు పనిలేని ఆయన. తాంబూలా లేసుకొంటో కళ్ళు మూశాడు.

లేచేటప్పటికి రాత్రి తొమ్మిదయింది. వెంటనే కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చి భోజనాలకి లెమ్మన్నారు. తివాసీల మీద గాసులైట్ల ముందు తాంబూలాలు వేసుకొంటో కూచుని 'ఈ అదృష్టమంతా నిజమా, కలా' అని ఆశ్చర్యపడుతూ వుండగా, మళ్ళీ ఆ ముసలామె కనపడ్డది. ఆమె వెంట ఆమెకూతుళ్ళని ఇద్దరిని తీసుకొచ్చింది. ముగ్గురూ గురువుగారి పాదాలకి నమస్కారం పెట్టి కూచున్నారు. అప్పుడు ముసలామె మాట్లాడింది.

"అయ్యా, మీరు మా ఇంటి ముందు నించి తెల్లారే పాడుతు వెళ్ళారే, అప్పుడు మీ పాట విన్నాను. అటువంటి సంగీతం నేను విని ముప్పై యేళ్ళయింది. అది వొక మహా తేజస్వి, అవతార పురుషుడు పాడాడు. అప్పుడు నేను నిండు యవ్వనంలో, ఒక జమీందారుగారి ఆదరంలో వున్నాను. ఈ సంపద అంతా ఆయన కటాక్షమే యేనాడు తెరచాటున నుండి ఆయన పాట విన్నానో, ఆనాడే నా హృదయాన్ని ఆయన కాళ్ళ ముందు పారేశాను. నా కొక హృదయముందనీ అది శాశ్వత మైనదనీ అంతవరకు తెలీదు. రహస్యంగా ఆయనకి కబురు పంపి నా జీవితం ఆయనకి అర్పించాను.

ఆయనకి కూడా నన్ను చూసి ఆదరం కలిగింది. నే నేమీ అన్యాయం చెయ్యలేదు. జమీందారుగారితో చెప్పేశాను. యేం జరిగిందో తెలుసునా? ఆ ఈశ్వరీ సమానుణ్ణి, సహవాసంగా అడివికి పిలుచుకుని వెళ్ళారు జమీందారుగారు. ఆయన యామైనాడో ఇంత వరకు తెలీదు. ఆయన గాన మాధుర్యంలో లీనమైన నా మనసు ఈనాటి వరకు కళ్లు తెరవలేదు.

"ఈనాడు విన్నాను, మళ్ళీ అటువంటి గాంధర్వ ప్రజ్ఞా విశేషం.

"ఇప్పుడందరూ పాడేవాళ్ళే. కాని ఒక్కడికీ సంగీత జ్ఞానం కొంచెమన్నా వుందా? పోనీ అభిమానముందా? పోనీ సంగీతానికీ, గొడ్డు అరుపులకీ భేదం తెలుస్తుందా? జరిగిందంతా విన్నాను మీరు పాడే విశ్వమోహన గానం ఈ పాడు వూళ్ళో యెవరికర్థమవుతుంది? యే కూనిరాగాలో, హిందూస్తానీ టప్పాలో కొట్టేస్తే, తమరిని ఆకాశానికి పొగిడేసి, ప్రతి వెధవా బ్రహ్మరథం పట్టేవాడే!"

తన కూతుళ్ళనిచూసి, "వీళ్ళకి సంగీతం యెంతో కష్టపడి నేర్పాను. ఒక్కరోజు సాధనం మానారా ఆరోజు వీళ్ళ మొహం చూడను. ఈవాళ మీరు అలిసి వున్నారు. పాడమని అడగను. కనక ఈ దాసురాళ్ళ పాట విని తప్పులు క్షమించాలి' అని వాళ్లిద్దరి చేతా పాడించింది.

మర్నాటినించి గురువుగారిచాత పాడించడం, తను ఆనందించడమే ఆమె వని. ఇట్లా నాలుగు రోజులు గడిచిన తరవాత, అక్కణ్ణించి కదలడానికి యెంత ఇష్టం లేకపోయినా, ఇంక బావుండదని, వెడదామన్నారు. శిష్యుడు మాత్రం తను శాశ్వతంగా అక్కడే వుండిపోయే వుపాయ మేదన్నా వుందా అని ఆలోచిస్తున్నాడు. కాని ఆమె వాళ్ళని బలవంతం చేసి, ఇంకొక పదిహేను రోజులుంచింది. శిష్యుణ్ణి ఆమె వొక్కసారి కూడా పాడమని అడగనందువల్ల వుండి పోయే ఆశలు అణగారి పోయినాయి అతనికి. తాంబూర మీటడంలో అతని ప్రజ్ఞా విశేషాన్ని కూడా ఎవరూ గమనించలేదు. వాళ్లు వెళ్ళే రోజున వెండి పళ్ళెంలో ముప్ఫై మొహరీలు పోసి గురువుగారి ముందుపెట్టి, నమస్కారం చేసి, పట్టు తాపితాలు కట్ట బెట్టింది. తక్కిన వారికి ఒక్కొక్కరికి తలో యాభై రూపాయలిచ్చింది. పనిలేనాయనికి కూడా.

★ ★ ★

# నాటకం

శుద్ధ అప్రయోజకుడనే నింద పొగొట్టు కోవాలనే కొర్కెతో సూరాయ ఆలోచించాడు - సునాయాసంగా, ఒక సంచి రూపాయలు సంపాదించే అనాయాసమైన మార్గమేదాయని. వాడు జన్మెత్తింది మొదలు తన శక్తివల్ల ఒక్క అరగానీ తెచ్చుకోలేదు. చాలా కాలం కష్టపడే వోపిక తనకి వుండదని తెలుసు. లాటరీ వేద్దామనుకున్నాడుగాని వెయ్యడానికి ముందు కానీలేదు. తీవ్రమైన ఆలోచనలు చెయ్యగా నాటకం వేయించడం సులభ మార్గంగా తోచింది. నాటకం కంట్రాక్టు తీసుకోవాలంటే, తనని నమ్మేదెవడు? కాదు. తానే నాటకం వేయిస్తే కీర్తి వస్తుంది. తను వేషం వేస్తే ఇంక చెప్పాలా? తన సంగతి కనిపెట్టే వాళ్ళు లేరుగాని, తనతో పాడగలిగినవాడు ఈ ఆంధ్ర దేశంలో లేడని అతనికి గట్టి నమ్మకం. అది గాక నాటకం వెయ్యాలంటే పెట్టుబడి యేమాత్రమూ అక్కరలేదు. బావుంది. కాని రావులపర్రులో నాటకానికి టిక్కెట్లు కొని వొచ్చే వాడెవడు? ఏదన్నా వూరుపోయి వెయ్యాలి. రైలు ఖర్చులేదు; నాటకం సంగతి చెప్పి బాబుని రైలు ఖర్చిమ్మంటే, ముందు తంతాడు-సరేనని కాచుకొనివున్నాడు సమయం కోసం.

చివరకి-పండక్కి శెలవలకి బావని తీసుకురమ్మని కాకినాడ పొమ్మన్నాడు తండ్రి. మంచి సందు దొరికింది. రాను పోను రైలు ఖర్చులు తీసుకొన్నాడు. రైలెక్కాడు. ఎక్కినప్పటి నించి నాటకం సంగతే ఆలోచన. ఏ నాటకానికి తక్కువ పాత్రలు కావాలి? పుస్తకాలమ్మే వాడొచ్చాడు. పుస్తకాలన్నీ గంట తిరగేసి చివరకి హరిశ్చంద్రలో తక్కువ పాత్రలు కావాలని తేల్చాడు. తెలిసిన నాటకమూ రసవంతమయినదీ అని. అసలు లోహితాస్యుడి పేరు ఎత్తితే చాలు పిల్లలు చచ్చిన తల్లులందరూ కన్నీళ్ళు కారుస్తారు. ముసలి వాళ్ళందరూ శ్మశానంచూసి వొణుకుతారు. నాటకం పాడు చెయ్యటానికి

ఎవడికీ శక్తి వుండదు. ఆ నాటకంలో హరిశ్చంద్రుడినమ్మే పద్యమూ, చంద్రమతిని నరికేప్పటి వచనమూ వచ్చు అతనికి. ఆ పుస్తకం బేరంచేసి నాలుగోవంతు ఖరీదుకు కొని, పోర్షన్ తిరగేస్తున్నాడు. హరిశ్చంద్రుడి పోర్షన్ చదివిన కొద్దీ, ఆ పాత్రని తన కోసమే కవి కల్పించినట్లుంది కవేమిటి! తన వేషం కోసమే, ఆ రాజుని బ్రహ్మ కృతయుగంలో సృజించాడు. విశ్వామిత్రుడి కాళ్ళమీద పడేప్పుడు రాజఠీవి వొలికేట్లు చంద్రమతి వంక ఎట్లా చూడాలో ఆలోచిస్తూ లేచి నుంచుని చూసుకుంటున్నాడు. ఇదీ ఏదో కొంత పొద్దుపోతుందని పెట్టెలో వాళ్ళు అతనికేసి చూస్తున్నారు. ఇంతలో పద్యం అందుకొని చదువుతున్నాడు. అతని కంఠం అతనికే ఇంపుగా వుంది. చివర చప్పట్లు కొట్టినట్టే వినబడ్డాయి. ఇంకో పద్యం మొదలు పెట్టబోతే తోడి రాగంలో హార్మోనియం వాడు తనకి ముందు అందిస్తున్నట్లు ఊ అని, హార్మోనియం శబ్దం చేస్తున్నాడు. ఇదంతా చూస్తున్న బ్రాహ్మడొకాయన "ఏ వూరండీ?" అన్నాడు. వినిపించుకోలేదు. పద్యం ఆరంభించాడు. మధ్యలో ఆపి, కొంచెం బాగా, రాగం లేకుండా, వచనంవలె చదివి, ఆడియన్సు వేపు చూసేటప్పటికి ఆయన మళ్ళీ.

"ఏ వూరండీ?" అన్నాడు.

సంగీతమాపి సంభాషణలోకి దిగాడు.

"మీ దేవూరండీ" అని సూరాయ్ ఆయన్నడిగాడు.

"కనగాల"

'ఎక్కడికి వెళుతున్నారు?"

"కడియం"

"ఎందుకు?"

"పెళ్ళికి"

"ఎవరి పెళ్ళికి?"

"మీరేమిటి పాడుతున్నారు?"

"హరిశ్చంద్ర"



"ఓ, చాలా మంచి పుస్తకం అందమైన పద్యాలు"

"మీరు చదివారా?"

"ఆ"

"పద్యాలు వచ్చునా?"

"నక్షత్రకుడివి వచ్చు"

"అవి మాత్రమే ఎలా వచ్చు?"

"ఆ వేషం వేస్తాను"

"ఆ....తమ నామధేయం?"

"ఎడవల్లి నాగభూషణం"

"ఓ, తమరా! చాలా సుదినం, పెళ్ళి ఎన్ని రోజులు?"

"ఐదు"

"మీరు లగ్నాని కుండి రాలేరూ."

"ఎందుకు?"

"కాకినాడలో నాటకం - హరిప్రసాదరావుగారు హరిశ్చంద్రుడు వేస్తానన్నారు. చంద్రమతి జగ్గారావుగారు - నక్షత్రకుడికి అసలు గ్రంథకర్తే వచ్చి తీరతానని బతిమాలుకున్నారు. కాని వాళ్ళ బంధువుల్లో ఉపనయనం ఒకటి వచ్చింది. రావడానికి వీలులేదు. అన్నారు. అందుకని తమరు...."

"తప్పకుండా వస్తాను"

"ఎల్లుండి రాత్రి నాటకం హాలు దగ్గిరికి సరాసరి విచ్చేయ్యండి"

"తప్పకండా"

"అక్కడే రయిలు ఛార్జీలు ఇచ్చేస్తాను."

"సరే, దానికేంలెండి"

సూరయ్ కాకినాడ చేరుకునే లోపల హరిశ్చంద్ర పార్టు అంతా వొల్లించాడు. కొంచెం సేపట్లో ఆ పెట్టెలో వాళ్ళంతా దిగారు. భేతాళుడి మీద ఇతను చెయ్యి విసరడాలూ, అవీ చూసి ఏ స్టేషనులోనూ ఎవరూ ఎక్కలేదు.

## 2

కాకినాడలో దిగి బావగారి ఇంటికి వెళ్లాడు.

"ఏమిరా, తమ్ముడూ, ఎప్పుడు రావడం?"

"వ్యవహారం మీద వచ్చాను"

"వ్యవహారం? నీకు వ్యవహారమేమిటి?"

"నన్ను తీసుకొచ్చారు."

"ఎవరు? బుద్ధివున్న వాళ్ళేనా?"

"నాటకం వాళ్ళు"

"సరేలే. ఐనా, వాళ్ళకి మాత్రం నువ్వెందుకు?"

"ఎందుకు తీసుకొస్తారు? వేషం వెయ్యడానికి"

"వేషాలేమిటిరోయి!"

"హరిశ్చంద్ర"

తమ్ముడి మతి పోయిందని ఊరుకుంది.

"ఎల్లుండి మీ ఇద్దరూ బయలుదేరి రావాలి"

"ఎక్కడికి?"

"నాటకానికి"

"నాటకానికా? ఇంకా తీసుకు రమ్మని నాన్న నిన్ను పంపాడేమో ననుకున్నాను."

"అవునవును. అది కూడాను. ఎట్లాగూ వెడుతున్నావు కదా, వాళ్ళిద్దర్నీ తీసుకురా" అనికూడా అన్నాడు.

"రైలు చార్జీ లిచ్చాడా? మీ బావ నెరుగుదువుగా?"

"ఇయ్యలేదు. ఇవ్వబోతూ వుంటే నేనే వొద్దన్నాను. నాటకంలో కనీసం ఏ అయిదారు వందలలో మిగులుతాయా, అవిపెట్టి చీరెలూ అవీ కొనుక్కుని-వుప్పాడ పంచలు చవకగా దొరుకుతాయిటగా!"

"మరి మిగిల్తే నీకెందుకిస్తార్రా ఆ డబ్బు?"



ఆలోచించాడు.

"ఆ షరతు మీదనే నేను వొప్పుకుంది."

సూరాయ్ బావకి ఒక అన్న వున్నాడు ఆ ఇంటో. దున్నపోతు వంటి మనిషి. తమ్ముడింట్లో భర్తీగా భోంచేయడం ముఖ్యోద్యోగం.

"బావా, ఎప్పుడన్నా నాటకంలో వేషం వేశావా?"

"లేదు. ఏం?"

"ఓ చిక్కొచ్చిందిలే. రేపు రాత్రికి అందరూ హేమాహేమీలు దొరికారు. కాని జగ్గరాజు రాడేమోనని అనుమానం, రాడులే, కారణం ఉంది. దానికి. నా పక్కన వేషం వేస్తే పేరు పడిపోతుందని భయం. ఇంకా అతని సంగీతం చూసేదెవరు? పోనీ నువ్వే వేస్తావా"

"ఏం వేషం?"

"చంద్రమతి."

"నేనా?"

"నువ్వే! రంగు వేస్తే చక్కగా ఉంటావు."

"నిజమే?"

"నిజం."

"పుస్తకం ఏదీ?"

"ఒకటి కొని చదివెయి"

ప్రెస్సుకు వెళ్లాడు సూరాయ్. రాసికెళ్ళిన నోటీసు అచ్చు కొట్టిమ్మన్నాడు.

<u>అద్భుత నట సమ్మేళనము</u>

హరిశ్చంద్రుడు-మన ప్రసాదరావుగారి ప్రసాదమే.

చంద్రమతి-నటరాజు జగ్గరాజు మార్తాండుడే రాణి.

నక్షత్రకుడు-లక్ష్మీకాంతముగారి కాంతి మీరెరుగనిది కాదు.

విశ్వామిత్రుడు-ఒకానొక భీషణోన్మూర్తి. ఎవరో కనుక్కోండి.

లోహితాస్యుడు-బాల కుమారకురంగుడు బాలా త్రిపుర సుందరుడు.

కలహకంఠి-గజ్జల గుఱ్ఱం.

"ఏమిటండీ, యీ నోటీసు ఇల్లా వుంది?"

"నాకు తెలీదు. వెంటనే పదివేల కాపీలు కొట్టిమ్మన్నారు. రేపు మధ్యాహ్నం రైలులో వస్తారు."

"సరేలెండి"

సగం దూరం వెళ్ళి తిరిగి వచ్చి.

"లోహితాస్యుడికి ఒక కుర్రాడున్నాడా? మామూలుగా వేసేవాడికి పరీక్షలు అడ్డం వచ్చాయి."

"ఎండా కాలంలో పరీక్షలేమిటి?"

"అదొక ముదనష్టపు స్కూలు."

"వున్నాడు. కాని వాడికి అక్కడక్కడ రుక్మాంగదలోకి లాగుతుంది."

"పరవాలేదు. పంపండి"

లోహితాస్యుడు కూడా కుదిరాడు.

హాలూ, బళ్లూ, లైట్లూ, బాండూ నాటకం రాత్రి డబ్బిచ్చే పద్ధతిని కుదిర్చాడు.

అప్పుపెట్టి ఇడ్లీ, కాఫీ, కానీ ఇచ్చి కిల్లీ వేసి, సిగరెట్టు తాగుతో ఒక్క విశ్వామిత్రుడు దొరికితే తక్కిన వేషాలు తాత్కాలికంగా....

దభేలున కిందపడ్డాడు. మీద సైకిల్ పడ్డది. దానిమీద సాయేబు పడ్డాడు. ముగ్గురూ ఒకరి బంధం ఒకరు విడిపించుకోవడం కొంతసేపు పట్టింది. అంతసేపు సాహెబు అరుస్తూనే వున్నాడు.

సా:- "అరే, చెవుడా నీకు? బెల్ వినపడదూ? చూడు, చొక్కా జేబులో కోడిగుడ్లు అన్నీ చితికి చొక్కా అంతా కారుతోంది." గుంపు సరదాగా చూస్తోంది.

"చూడవయ్యా, నిన్నిప్పుడేం చేస్తానో." అన్నాడు సాహెబు.

"సాహెబుగారూ! విశ్వామిత్రుడి సంగతి విన్నారా?"

"విశ్వామిత్రుడు ఎవడురా! నా కోడిగుడ్ల ఖరీదు-"



"వాడాండీ-వాడో మహర్షి. అతని ఆశ్రమంలోకి అనుజ్ఞ లేకుండా వెడతాడు మొదటి రంగంలో"

"ఏమిట్రా?"

"మీరు నాటకంలో వేషం వేస్తారా?"

"అరే వీడు పిచ్చివాడులాగున్నాడే"

"రేపు రాత్రి పాక దగ్గిరికి పెందరాళే రావాలి తమరు. ఇంక నాకు గతిలేదు మీరు తప్ప. మీరు రంగస్థలం మీద అట్లా దూకారంటే - నేను హరిశ్చంద్రుడు - తల తన్నడం కూడా వుంది - మీకెన్ని వన్సుమోరులు వస్తాయో నేను లెక్క చెప్పలేను-"

"అరే, దివానా"

"కాదు. ఇదుగో కాయితం - మీ పేరు కూడా వేశాను చూడండి. ఎంత వెతికినా నాకు తగిన గడ్డం దొరకలేదు విశ్వామిత్రుడికి పెట్టడానికి. ఇంక వెతకఖ్ఖర్లేదు."

సాహెబుకి నాటకంలో వేషం వెయ్యాలనేది పసితనం నించిన్నీ జీవితాశయం.

"మరి ఆ తెలుగూ గిలుగూ రాదే!"

"రుషులు అట్టానే మాట్టాడతారు. ఆ భారమంతా నాదే, తమరు రండి."

## 3

ఎనిమిదయింది. "ఏదిర నా సీత" అని పెద్ద గొంతుకుతో వాపోతున్నాడు బాకావాడు. సన్న పీకల బాండువాడు "నా సీత ఏదిరా?" అని యేడుస్తున్నాడు. పెద్దడోలువాడు "ఇందులో వుందిర నీ సీత" అని పిలుస్తో బాత్తున్నాడు చేతి సత్తువ కొద్దీ. పక్కన స్కూలు కుర్రాడు ఒకడు అక్కడ వున్న వాళ్ళందర్నీ "ఏదిర నా సీత" అని కనుక్కుంటున్నాడు. లైట్లు గబ గబా వెలుగుతున్నాయి. టిక్కెట్ల తను వూపిరాడకుండా అమ్ముతున్నాడు.

సూరాయ్ తన బావమరిది బావమరిదిని టిక్కెట్లమ్మడానికి పెట్టాడు.

సూరాయ్ వేషం తయారయింది. అద్దంలో నిలుపునా చూసుకుంటే, ఎవరోవచ్చి ఎదురుగా నుంచున్నట్లుంది అతనికి. ఇంత అందమైన వాణ్ని తెలీక ఇన్నాళ్ళూ జీవితం వృధాగా గడిపానుగదా, నాకు పిల్ల నెవనిస్తారని పెళ్ళి ప్రయత్నమన్నా చేసుకోలేదు కదా, పోనీ, యే వితంతు శరణాలయం ముందు యిటూ అటూ తిరిగినా ఒక శరణాగతురాలన్నా, ఆలయం వదిలి తన శరణుచొచ్చి వుండునే అని చాలా చింత పడ్డాడు. "ఈ నాటకంలో ఓ నాలుగువందలు దక్కిందంటే, ఆ మూలధనంతో వెంటనే వివాహ ప్రయత్నం చెయ్యాలి. కన్యా, వితంతువా? నాలుగువందలు మిగులుతుందా లేదా?" వేషంలో వున్న సంగతి మరిచి, బిరబిరా, బుక్కింగు గది దగ్గరికి నడిచాడు.

"ఒరేయ్, రారోయ్, సింహడూ, రారోయ్" అన్నాడు ఓ కుంటి కుర్రాడు గేటు దగ్గిర్నించి. వాడి వెనక నేలయీనినట్టు పదిమంది పోగైనారు.

"ఎంత వచ్చిందిరా?" అన్నాడు సూరాయ్.

"మూడు వందలు చిల్లర" అంటో బావమరిది బావమరిది తలయెత్తి చూసి నిర్ఘాంత పోయినాడు.

బైట నించి కేకలు వినపడుతున్నాయి.

"హరిప్రసాదరావు రా."

"కాదురా, హరిప్రసాదరావు లావు."

"కాయితంలో వేశారంటే."

"ఐతే, వీడు మంత్రేమో!"

"జవానుగాడురా."

"మరి కిరీట మేమిటి?"

"జవానే ఇట్లా వుంటే రాజెట్లా వుంటాడో!"

"ఏమండోయ్, మీది యేం వేషమండి!"

"ఓ పద్యం చదవండి."

సూరాయ్ ఒక్క పరుగున పాకలో దూరాడు.

వేషధారులందరూ పోగైనారు. నక్షత్రకుడు డ్రస్సు అడిగితే,



"నక్షత్రకుడికి డ్రస్సేమిటి? వున్నది తీసేసిరా" అన్నాడు. లోహితాస్యుణ్ణీ అంతే. విశ్వామిత్రుణ్ణీ అంతే.

"నేను సరిగా తగిన మనుష్యుల్ని చూసే ఏరుకుంటాను. ఇంక వాళ్ల ఏమీ మార్పు లేకుండానే స్టేజిమీదకు రావచ్చు" అన్నాడు.

"చంద్రమతి కూడా అంతేనా?"

అనడం విని తయారు పూర్తి అవుతున్న చంద్రమతి ఆ మూల నించి కదిలి వచ్చింది. ప్రతివాడూ నవ్వుతూ విరగబడ్డాడు. సూరాయ్‌కూడా, లోహితాస్యుడు "బాబోయ్!" అని విశ్వామిత్రుణ్ని కావిలించుకున్నాడు. కట్టిన కొర్నాటి చీర మోకాళ్ళ వరకే అందుకోవడంవల్ల కాళ్ళు బుట్ట బొమ్మల్లో దూరిన వాడి వాటివలె మధ్య కదులుతున్నాయి. రంగు పాదాల వరకు పూసి వూరుకున్నాడు రంగుల వాడు. "ఏమిరా? కాళ్ళకో" అంటే, ఒక పీపాడు రంగూ, పెద్ద కుంచా తీసుకురమ్మన్నాడు వాడు. రెవికలూ జాకట్లూ, ఒక్కటీ చేతులు దూరలేదు. ఛాతీ యెక్కువయింది. వెనక పమిటవేసి, జబ్బలకి పూసలు కట్టి. 'అజంతా అలంకారం అని వదిలేశారు. పమిట కదిలినప్పుడల్లా తెల్లని చేతుల వెనక గుహ వంటి చంక కనపడుతోంది. రొమ్ము దిళ్ళకి కొత్త తాళ్లు కట్టి నలభై రెండంగుళాల ఛాతీ మీద బిగించడం వల్ల చంద్రమతికి వూపిరాడక తాటకి గర్జనాన్ని పోలినట్టు దిగ శ్వాస మొదలు పెట్టింది. పైగా ఆ రెండు దిళ్ళూ ఛాతీ మధ్యగా చేతి, చిన్న కురుపులువలె కనపడుతున్నాయి.

## 4

మొదటి బెల్, హరిశ్చంద్రుడి వేట సీను.

ప్రతివాడికీ చెప్పేశాడు ఏం చెయ్యాలో. విశ్వామిత్రుడు మాత్రం ఒక్క ముక్క రాదన్నాడు.

"ఏం లేదు. బహు సులభం. అరు- తిట్లు-అప్పుడప్పుడు తన్ను."

రెండో బెల్, తెర యెత్తబోతూ వుండగా-

"మాతంగ కన్యలేరీ!" అన్నాడు వకడు.

"అవును, మరిచానే!"

ఆలోచించాడు.

తెరలెత్తేవాణ్ని పంపి, బైట వున్న ఇద్దరు కుర్రాళ్ళకి ఫ్రీ టిక్కెట్లు ఇస్తామ
పిలిపించాడు. కాని వాళ్ళకి పాట రాదన్నారు. ఒకడు భయమన్నాడు.

టైమ్ ఐపోతూంది. దీపాలు వెలుగుతున్నాయి. జనం గోల చేస్తూం
బైట బాండు వాళ్ళు.

'మరువకు డార్యులారా, పంజాబు వధలు!' అని ఆర్యుల్ని
దగ్గిరకి రమ్మని ఆహ్వానిస్తున్నారు.

బాండువాళ్ళని పిలిపించాడు.

"ఒరే ఏమన్నా, జాపళీలు వచ్చునురా?"

"నీ నామామే ఎంతో రుచిరా, వచ్చును."

"మంచిది. ఇంకోటి?"

"మరుగేలరా, ఓ రాఘవా!"

"అదీ జావళీలాగే వుంది బావుంది. ఈ రెండు జావళీలూ పా
మీరు. మీరిద్దరూ మాతంగ కన్యలు."

"ఏమిటి"

"మాతంగ కన్యలు."

"కన్యలా? మేము కన్యలా? అంటే?"

ఒకరి బిరుసు గడ్డం ఒకరు చూసుకుంటున్నారు.

అందరూ నవ్వుతున్నారు.

"అది కాదురా. మీ పై బట్టలు కప్పుకుని సైడు కర్టన్‌లో. కొం
కనబడుతో ముసుగులు మాత్రం కనపరుస్తోకూచుని పాడండి. చెరో రూపా
ఎక్కువ యిస్తాను" అంటోనే తెర యెత్తించాడు.

ధనస్సు పట్టుకుని అడివంతా, పాటతో గంతులేస్తున్నాడు సూరయ
హార్మోనియం గోలలోనూ, తబలా దెబ్బల్లోనూ, ఏం పాడుతున్నాడో మాట
వినపట్టం లేదు. "చెండాడెదన్ - బంతాడెదన్ - కొండాడెదన్, సింగాడెదన్
రా - పో, కా, రీ - తొక్కాడెదన్, గొడ్డాడెదన్ ఛీ పో గో - డొక్కాడెద
గిలా డెదన్.-"





అని భీషణంగా ఇటూ అటూ వురికాడు. ఇంతలో చంద్రమతీ, లోహితాస్యుడూ వచ్చారు. చంద్రమతి హరిశ్చంద్రుడికి పిచ్చెక్కిందిగావునని 'నాథా!' అని సింహగర్జన చేసేటప్పటికి హాలంతా గోల!

లోహితాస్యుడు బెదురుతో, కింద దీపాల వరస దగ్గరనుంచున్నాడు. చంద్రమతి వాడి వేపు తిరిగి 'కుమారా' అని పిలిచేటప్పటికి, ఒక్క కేకేసి, లోపలికి పరిగెత్తాడు.

మాతంగ కన్యలు సైడ్ కర్టన్ దగ్గిర చప్పుడు చేశారు. వాళ్ళు ముసుకులు తప్ప ఏమీ కనపట్టం లేదు. ప్రతాపరుద్రీయంలో ముమ్మడమ్మల మల్లే వున్నారు.

'సరే- పాట కానీండి' అనేటప్పటికల్లా, రెండు పెద్ద యిత్తడి బాకాలు స్టేజిమీదిగా పెట్టి-

"ముద్దిడరారా-' అని పెద్దగా వూదారు.

హరిశ్చంద్రుడు కళ్ళు నిప్పులు రాలుస్తో, వళ్ళు వట వట కొరుకుతున్నాడు. తప్పక ఆ కోపంలో పద్యం వుండి తీరుతుందని, హార్మోనియంలో 'వసంత' రాగం అందిచ్చాడు. ఇంతలో లోపల్నించి యెవరో ఆ బాకాలులాగేశారు. వెంటనే వాళ్ళు కంఠంతోటే అందుకున్నారు ఆ పాటని. హరిశ్చంద్రుడు కూడా భరించలేక "చాలు, చాలు, ఇదండి బహుమానం" అన్నాడు. హరిశ్చంద్రుడేమిటి? ఆ పాట ఆపినందుకు హాలులో ప్రతివాడూ బాధ ఎక్కువై బహూమానాలివ్వడానికి సిద్ధపడ్డారు.

హరిశ్చంద్రుడు పూసలహారం వొకటి మెళ్ళోంచి తీసి యివ్వబోయే టప్పటికి. ఆ కన్య ల్దిరూ,

'నీ ముద్దు మొగమూ, సొగసు చూసీ-' అని చేతులు జాచి పాడుతో ఒకర్ని తోసుకు వొకరు స్టేజిమీదికి వచ్చారు.

'అరే, అరే' అంటో వాళ్ళని వెనక్కి ఈడుస్తో వెనకనే నక్షత్రకుడు కూడా వచ్చాడు. హాలులో అల్లరి చూసి బెదిరి, ఆ అబలలు బహుమతి నందుకోకండానే వెళ్ళి పోయినారు.

వెంటనే విశ్వామిత్రుడు

"అరే భాంచత్! నీకూ ఎంతా పొగర్-చూస్కోరా, నీ అబ్బ!"

అంటో సైడ్ కర్టన్‌లోంచి హరిశ్చంద్రుడి మీద ఒక్క దూకు దూకా

చంద్రమతి 'రుషివర్యా' అంటో అడ్డం వెళ్ళింది.

"ఒసే పిశాచీ, ఆడ సైతాన్- నీకీ-" అని జుట్టు పట్టుకుని ఒక తన్ను తన్నాడు.

టోపారహితంగా చంద్రమతి వెల్లకిలాపడి, 'నీ దుంపతెగా' అంటోం

విశ్వామిత్రుడు కూలబడి, చేతులో టోపావొంక విచిత్రంగ చూస్తున్నాడు. విశ్వామిత్రుడు వెంటనే లేచి, నవ్వుతున్న నక్షత్రకుణ్ణి ఒక్క తన్ను తన్ని,

"ఒరే, రాజా, నీకే కొంపా తీసేస్తా"

అంటో చూసేప్పటికీ హరిశ్చంద్రుడు కోటు రెండు చేతుల్లో పట్టుకొ పరిగెత్తుతున్నాడు.

నత్రకుడి వంక తిరిగేప్పటికి వాడు చివాలున లేచి, దోవ దొరక్క రిజర్వు కుర్చీలో కూచున్న డాక్టరుగారి వొళ్ళో దూకారు. ఆ డాక్టరు త వెనకనున్న లేడీ బెంచి మాస్ట్రీటు భుజంమీద తలకాయ పెట్టుకొ మూర్ఛపోయాడు.

ఇంతలో హాలంతా గోల. కొందరు.

"వెంకటచలం హరిశ్చంద్ర" అన్నారు.

"హరిప్రసాదరావు ఏడీ?"

"వీడా నక్షత్రకుడు?"

"మా డబ్బు మాకియ్యండి."

అంటో వచ్చింది గుంపు స్టేజిమీదకి. స్టేజిమీద తిరగబడ్డ విశ్వామిత్రుడి తల కాస్తా, నేలకేసి కొడుతున్న చంద్రమతి ఈ గుంపుని చూచి, స్టేజ తలుపులోంచి ఒక్క పరుగున గేటు తెరుచుకుని టిక్కెట్లు దొరక్క నుంచున్న గుంపుమీద పడి రోడ్డువెంట పరిగెత్తింది. విశ్వామిత్రుడులేచి హరిశ్చంద్రుడు పారేసి పరిగెత్తిన విల్లుతో కంట్రాక్టరు శంకరయ్యనీ, కంసాలి పేరయ్యనీ



బాదాడు. రెండు నిమిషాలు గుంపు ఆగింది. కాని బస్సు బాబాసాహెబ్ "నీ కెందుకురా, భాయ్!" అనేటప్పటికి విశ్వామిత్రుడు తన దోవన తాను పోయినాడు. అటు తరవాత మహాప్రళయం.

## 5

రాత్రి పన్నెండు దాటింది. నిశ్శబ్దం. నాటకం పాక వెనకనున్న నక్కిస పొదల వెనకాలనించి, సూరయ్య, మెల్లిగా తలెత్తి చూశాడు. యిటూ అటూ, ఆ ముళ్ళ మధ్య విశ్రాంతి తీసుకుంటున్నంత సేపూ డబ్బు పెట్టెమీదనే మనసు నిలిపి వుండడంచాత అంతమాత్రం వోపిక వచ్చింది గాని లేకపోతే అసలా రాత్రికి అక్కణ్ణించి కదలకపోను. అరణ్యంలో కిరీటం వదిలి, ముళ్ళుగీరుకున్న చేతులతో చిరిగిన మొఖమల్ కోటుతో నాటకం పాక వీధులబడి, ధనం పెట్టెవైపు నడుస్తున్నాడు మహరాజు.

"అడుగో, వచ్చాడు" అన్నాడు ఎవరో, తటాలున చీకట్లోంచి.

'వొచ్చాడు, వచ్చా'డని అనేక కంఠాల, ప్రతిధ్వనించింది నాలుగు వేపుల్నించీ ఆ మాట. మాటలతో పాటు కంఠాలు, కంఠాలతో బాటు కాళ్ళూ పరిగెత్తాయి అతనివైపు. అతను గేటుమీద కాంక్ష పడ్డాడు. అక్కడ అడ్డంగా - మాతంగకన్యలు 'వచ్చాడు' అంటున్నారు. బహుమానం కోసం గావును. ఇంకా కాచుకునే వున్నారు.

హరిశ్చంద్రుడు టిక్కెట్ల రూములో దూరి తలుపు బిగించుకున్నాడు. చుట్టూ ప్రెస్సు, లైట్లు, డ్రెస్సు, రంగులు, పాక, బాకాలు, హోటలు అన్నీ 'డబ్బు మా డబ్బు' అని గోల, విశ్వామిత్రుడి అప్పును పైసలతో సహా, రెండుసార్లు బత్య ఖర్చులతో తీర్చిన సత్యసంధుడు, కీర్తిధనుడైన చక్రవర్తి మీద అంత మాత్రం నమ్మకం లేకపోవడం కలికాల మహత్యం గాక ఇంకేమిటి. రాజ్య భ్రష్టుడికి తిరిగి రాజ్యమిప్పించి కదా, బాకీలడగవలసింది!

"సరే. చంద్రమతి పారిపోయింది. లోహితాస్యుడు ఏమైనాడో తెలీదు. నన్ను అమ్మి మీ అప్పులు తీర్చుకోండి" అంటో వచ్చి నుంచుంటే యేమయేదో!

అప్పటికీ, ఈ హరిశ్చంద్రుడు డబ్బు పెట్టె కోసం వెతికాడు. కాని చచ్చిన ముసలమ్మలాగు బోసినోరు తెరుచుకుని బల్లకింద పడివుంది ఆ పెట్టె. పెట్టె వంక చూశాడు. కిటికీలోంచి తొంగిచూసే ప్రజల వంక చూశాడు.

'మాయమేయ జగంబె నిత్యమని భావించి లోకంబునన్' అనే పద్యం చదివి కిటికీలోంచి కర్రలకి అందకండా పక్కగా పడుకున్నాడు.

'వెధవ! తెల్లారనీ' అంటో పరివారమంతా గది చుట్టూ కూచున్నారు.

హరిశ్చంద్రుడనేక పాట్లు పడ్డాడు గాని, ఈ నాటికి జైలు ప్రాప్తి కూడా అయింది.

"ఏమయ్యా! ఏమంటావు?"

మాట్లాడడు.

"పదివేలేమిటి? యాభై వేలు అచ్చు వెయ్యమన్నాడు. ఇందుకే గావును!"

"రెండు లైట్లేమిటి? పదహారు లైట్లు తెమ్మన్నాడు. పక్కకొట్లో డబ్బిచ్చి ఐదు లైట్లు తెచ్చాము."

"వాడికేం, మహరాజు!"

"తిప్పిన బజారే తిప్పి, వూదించాడయ్యా మా చాత, నాటకంలో కూడా బాకా లూదించాడు వీడి తస్సాగొయ్యా! మేమూ వేషగాళ్ళమనుకుని 'నువ్వేరా జగ్గరాజు, నువ్వేరా, మాతంగ కన్య' అంటో తన్నారు మమ్మల్ని" అనుకుంటో నిద్రపోయినారు కావలి వారు. మహరాజు గుర్రుకొడుతున్నాడు-హాయిగా, మొఖమల్ లాగు వేసుకుని.

ఇక్కడ ఇట్లా వుండగా మావాడు పరారి అయిన సంగతి మా వూళ్లో, మా ఇంట్లో అలజడి కలిగించింది. నాలుగు వేపులా టెలిగ్రాము లిచ్చారు. కాకినాడలో వున్నాడనీ, వెంటనే ఎవరన్నా వచ్చి తీసుకు వెడితేనే సరి. చిక్కుల్లోకి దిగుతాడనీ ఆ వూరినించిబదులు టెలిగ్రాం వచ్చింది. ఆ మధ్యాహ్నమే మా మామయ్య బయలుదేరి రాత్రి పది గంటలకి కాకినాడ చేరుకున్నాడు. మా వాళ్ళ ఇంటి కెడితే, వాళ్ళందరూ కాంప్లి మెంటరీగా నాటకానికి వెళ్ళి వుండడం చాత ఇల్లు తాళం వేసివుంది. ఏమీ తోచక, తెల్లవారిం తరవాత చూసుకుందామని అక్కడే అరుగు మీద మకాం పెట్టి పడుకున్నాడు మామయ్య. గంట



సేపయింది. అప్పుడే కునుకు పడుతోంది. ఇంతలో యెవరో భూతం లాంటి స్త్రీ అరుగు మీదికి ఒక్క దూకుదూకి, వెంటనే కిందికి దూకి, ఇంటి చుట్టూ పరిగెత్తుతోంది. ఏదో గాలి స్త్రీ రూపాన వచ్చి తిరుగుతోందని భేతాళ దండకం చదువుతో, వణుకుతో, వొదిగి పడుకుని చూస్తున్నాడు. కొంచెం సేపట్లో అది అలిసి, అరుగు దగ్గర ఆగి, 'ఎవరు?' అంది.

వాని శ్వాస కొండ గుహల్లోంచి వీచే తుపాను గాలివలె శబ్దం చేస్తోంది.

"మాది యీ వూరు కాదు" అన్నాడు.

అది బీడీ ముట్టించింది. ఆ అగ్గిపుల్ల వెలుతుర్లో మామయ్య మొహం చూసి ఆ భూతం,

'నువ్వా, బాబాయీ!' అంటే.

ఆ సైజు కూతురు తన కెక్కడా లేదే! యీ ఆడ భూతం తనతో ఆ వరస కలిపిందే అని, యేమని పిలవాలో, మాట్లాడాలో తెలీక తట వటాయిస్తో వుండగా, నాటకానికి వెళ్ళిన మా వాళ్ళు వచ్చారు.

"వొరే! తప్పించుకు బైట పడ్డామురా! బలే నాటకం. వాడేమైనాడో?" అంటో ఇంటి తాళం తీసి దీపం వెలిగించారు - భూతం కూడా లోపలికి వచ్చి నుంచుంది. మామయ్య లోపలికి వెళ్లాడు.

"వచ్చావా బాబూ, రక్షించావు"

"సరేగాని, యీ కూతురెవరు?"

"ఇదా? మీ సూరాయి భార్య"

అని అందరూ నవ్వుతున్నారు.

చివరకి సంగతంతా విని పాక దగ్గరికి వెడతానన్నాడు సూరాయ్ కోసం మామయ్య.

"లాభం లేదు. మేమూ వెతికాము. వాడు కిరీటం పెట్టుకునే పలాయసమైనాడు. అదిగాక వాణ్ని చూసినా, గుర్తుపట్టలేవు ఈ రాత్రికి. ముందు భోజనం చెయ్యి."

అని అప్పటి కప్పుడు వండి వడ్డించారు. రెండు గంటలయింది.కాని మామయ్య మనసంతా సూరాయి మీదనే వుంది. 'వెళ్ళి వెతుకుతా'నని బైలుదేరాడు.

"కిరీట ధారియై, తన్నులు తిని, ఒంటరిగా పొదల్లో సంచారం చేసే రాజాధిరాజెవరన్నా నీ కంటబడితే మనవాడనుకో" అన్నారు.

ఒచ్చి చూసేటప్పటికి మనవాడు గదిలోనూ, చుట్టూ పరిజనమూ-ప్రతాపరుద్రుడు ఢిల్లీ ఖైదులో పడుకున్నట్టుంది రంగం. మామయ్య సూక్ష్మ గ్రాహి. అత్తయ్య నడవడిలో రహస్యాలు కనిపెట్టే ప్రయత్నాలలో అతని బుద్ధి కుశాగ్రమయింది. గ్రహించాడు వ్యవహారం.

మొదట "లైట్లని" లేపాడు.

"ఎవరు?" అన్నాడు వాడు.

"మాది తెనాలి"

"అయితే?"

"అడిగితే చెప్పాను."

"నన్నెందుకు లేపావు?"

"నిద్ర వస్తోంది."

"అయితే?"

"ఇక్కడ పడుకోనా?"

"పడుకో."

"మీరందరూ సుఖంగా పడుకుంటే యీ రాళ్ళు మెత్తగా వున్నా యనుకున్నాను."

"మా ఖర్మ మిట్లా కాలింది! మీ రెందుకు తటస్థపడ్డారు?"

"మా మేనల్లుడు పిచ్చివాడొకడున్నాడు. వాడి కోసం ఈ వాళంతా ఈ వూళ్ళో వెతికి వెతికి కాళ్ళు కాయలు కాసిపోయినాయి."

"ఏమైనాడేమిటి?"

"వాడికి పిచ్చి. అంటే కొన్ని రోజులకి పోనాడు తానింకో మనిషి నఘకుంటో వుంటాడు. కొన్నాళ్ళు తాను ఆనంద గజపతిని అని మా గడ్డి



మాకు పెట్టాడు. కొన్నాళ్ళు శ్రీకృష్ణుణ్ణి అని కనపడ్డ వాళ్ళల్లా గోపికలని ముద్దు పెట్టాడు. నాలుగు రోజుల్నించి ఆ నాటకాలు రాశే లక్ష్మీకాంతాన్ని, నాటకా లాడిస్తానని ఇంటోంచి పరుగెత్తుకొచ్చాడు."

"ఎట్లా వుంటాడు?"

"సన్నగా యెర్రగా-కళ్ళ మధ్య గాటు"

"అడుగో! ఆ లోపల!"

"ఎక్కడ?"

"లోపల చూడండి, ఇట్లా రండి."

"ఛా! మావాడు కాదు. ఆయనెవరో-బొబ్బిలి మహరాజా"

"కాదండీ. వేషం మీద ఉన్నాడు. పిలవండి."

వాళ్ళందరూ పిలిచారు; లేవలేదు.

మామయ్య-"ఒరే, వెర్రి వెంకట్రాముడూ-ఎంత పని చేశావురా నాయనా," అనేటప్పటికి కంఠం విని సూరాయి చప్పున లేచాడు.

"పో, పో, వెంకట్రాము డెవరు?"

"చూశారా! వాడికి పూర్తిగా మతిపోయింది. తలుపు తెరవండి నాయనా!"

"లోపల గడియ వేసుకున్నాడు."

"ఇంటి దగ్గిరా ఇంతే. మా పక్కనున్న పోలీసు ఇన్స్పెక్టరు భార్యను సత్యభామ అని కావిలించుకున్నాడు. తన్నడానికి వస్తే గదిలో దూరి తలుపు లేసుకున్నాడు."

"వేంకట్రాముడూ, ప్రస్తుతం మీ పేరేమిట్రా?"

"నా పేరా, సూర్యనారాయణ. ఏమంటావు?"

"ఎన్నాళ్ళయిందండీ మా వాడు ఈ వూరు వచ్చి?"

"ఏమో, మేము మొన్నటిన్నించి చూస్తున్నాము."

"ఆ, ఎవర్నీ ఇంత వరకు కరవలేదు. కద! కరిస్తే వాళ్ళకీ వస్తుంది ఆ పిచ్చి."

"ఆ--"

అందరూ లేచారు ఆ మాటతో.

"ఎట్లా నాయనా?"

"ఏం చెయ్యం?"

"తలుపు తెరవరా, వెంకట్రాముడూ."

"పో, వెధవా, నీ వెంకట్రాముడూ నువ్వునూ! నిద్రలేక చస్తో వుంటే!"

"రెండు రోజులు బాగానే వుంటాడు. సరిగానే మాట్లాడతాడు. ఏదన్నా చిరాకు రాగానే ఇట్లా అవుతాడు. అప్పుడింక ఎదటపడ్డ వాళ్ళని కరుస్తాడు. అందులో సూర్యనారాయణ పేరులో వున్నాడా, మరీ కాట్ల కుక్క అవతారం. ఇంకేం చెయ్యను? నేను పోయి పడుకుంటాను. నాయనలారా, ఎక్కడికన్నా పరిగెత్తుతాడేమో, జాగ్రత్తగా చూస్తో వుండండి. అట్లా పడుకున్నట్టే పడుకుని, తలుపు తెరచుకుని వొచ్చి, కనపడ్డ వాణ్ణల్లా కరిచి కనపడకుండా పరిగెత్తుతాడు. జాగ్రత్త. వాళ్ళ అమ్మకి వీడు ఒకడే. పోనీకండి. బాబూ" అంటో మెల్లిగా వెడుతున్నాడు.

"పంతులుగారూ, పంతులుగారూ!"

"ఏమిటి."

"మేము వెళ్లాలండి. మీ పిల్ల వాణ్ని మీరు చూసుకోండి."

"అదేమిటి నాయనా! ఇంతసేపూ వాణ్ని ఆదరించి, కనిపెట్టి వుండీ, ఇప్పుడిట్లా మధ్యలో వొదిలేసి పోతే ఎలా?"

వినిపించుకోకుండా, తలల మీద గుడ్డలు వేసుకుని, ప్రెన్సు, బాజాలు అన్నీ వీధిలోకి నడుస్తున్నాయి. వాళ్ళని పోనిచ్చి

"ఒరేయ్, సూరాయ్-వెధవా, లేవరా ఇంక"

కళ్ళు నులుముకుంటో మావాడు లేచాడు-

"మామయ్యా"

"నేనే. తలుపు తెరు."

"వాళ్ళు తంతారు"

"ఎవరూ లేరు. తెరు.

మామయ్య సూరాయ్‌ని తెల్లారగట్టే రైలెక్కించి ఇంటికి తీసుకొచ్చాడు.

★ ★ ★

# రావణదర్శనం

మర్నాడు కథ పంపించి తీరాలన్నారు 'చిత్రగుప్త' యెడిటరుగారు. అందుకని, మామూలు కాకపోయినా, ఆ రాత్రి సుందరమూ, రాజా వెళ్ళిం తరవాత నిద్రపోక, కాయితం ముందు పెట్టుకుని ఆవలిస్తున్నాను. పెట్రోమాక్సు దీపం అప్పుడప్పుడు భగ్గుమంటోంది, కోమటినూనెలో నీళ్ళు కలవడంచేత. ఏమి రాయాలా అని యోచించి యోచించి, యేదైనా గట్టిది రాయాలని, సీతకి రావణుడి మీద ప్రేమ వున్నట్టు రాస్తే, కొందర్ని వుడికించే సంతోషమన్నా కలుగుతుందని, ఒక సంభాషన రాయడం ప్రారంభించాను, ఇట్లా -

యేకాంత రంగం - "చలం"

"లంకలో అశోకవనం. గొప్ప వెన్నెల. చెట్ల నీడలు శృంగారంగా గాలిలో కదులుతున్నాయి, ప్రపంచంలోని పరిమళం గల పూలన్నీ నలుదిక్కులా వుశాయి. దూరంగా రావణుడి మందిరపు బంగారు గోపురాలు వెన్నెలలో మెరుస్తున్నాయి.

ఒక పెద్ద వృక్షం కింద సీత కూచుని వుంది. మెల్లిగా 'రావణా' అని రాస్తున్నాను.

దీపంలో నుంచి పెద్ద మంట కప్పు దాకా లేచింది గది అంతా పొగతో విండింది. నా కళ్లు కనవళ్ళేదు. రెండు నిమషాల్లో పొగ అంతా దగ్గిరిగా చేరి ఒక ఆకార్ణంగా ఏర్పడ్డది, నా కెదురుగా.

"నా పేరెందుకురా రాశావు?"

అన్నది ఆ ఆకారం దశ కంఠాలతో.

కాయితం వంక చూశాడు. నా కళ్లని కిందికి దింపాడు రావణుడు, తన చూపుతో.

"కథ-"

"కథా! ఏం చేస్తావు రాసి?"

"చిత్రగుప్తకి పంపుతాను."

'నిన్ను పంపుతాముందు, చిత్రగుప్తుడి దగ్గిరికి. నా జోలి నీకెందుకు? ఏం రాయాలనుకున్నావు? నిజంచెప్పక పోతివా-"

గద యెత్తాడు. తక్కిన వాక్యం నా మనసులో పూర్తి అయింది.

"చెపుతాను."

చెపితే యేమంటాడో! అబద్ధం చెపితే?.... కాని మనసులో విషయాలు తెలుసుకోగలడేమో? ఐనా భయమెందుకు? బహుశా సంతోషిస్తాడు. అంతకన్న అతనికి యేం కావాలి?

"సీతకి మీ మీద ప్రేమ వున్నదని రాయబోతున్నాను."

ఆ వక్షం మీద మెరిసే మణిని ఒకటి పీకి నా మీద పారేస్తాడను కున్నాను. కాని నా జాతకం వేరు విధంగా నడుస్తోంది.

పదిహేనేళ్ల మట్టి నేను విసిరిన పువ్వులన్నీ ముళ్లయి రాలాయి ప్రజల మీద. (టాక్ట్) లేకపోవడానికి ప్రసిద్ధి కెక్కిన నక్షత్రంలో పుట్టాను.

"ఏమిటి? సీతకి....నా మీద ప్రేమా! నీ కిదేం దుర్బుద్ధి!....ఈ సంగతి నాకు బ్రహ్మ లోకంలో వినవొచ్చింది. భయం, భక్తీ లేకండా పురాణ వ్యక్తుల్ని గురించి-ముఖ్యంగా నన్ను గురించి ఇట్లాంటి అవాచకాలు పేలుతున్నావని- సీత నా ఒళ్లో కూచుందని రాశావుట కదూ?"

రాసినట్టు జ్ఞాపకం లేదు. కాని చదివినట్టున్నాను. వ్యవధి లేదు; యోచించడానికి, దడ లేస్తోంది.

"నేను కాదు?"

"ఎవరు?"

"ఇంకో ఆయన."

"ఎక్కడ వుంటాడు?"

"తిరుగుతో వుంటాడు."

"కాని, ఎవడో సీత నా చితిలో దూకిందని రాశాడుటగా!"

చచ్చాను.



నాకు తెలీదు."

"తెలుసు. చెతావా లేదా?...."

నా తల వొణికింది.

"ఎవడో, దుర్మార్గుడు. బుద్ధిహీనుడు."

"వాడి పేరు?"

"తెలీదు."

"తెలీదూ!ః నాకు తెలుసులే. ఐనా చెప్పు."

చదివాడేమో! దేవుడా!

అబద్ధం సరిగా చెప్పడం చాత కాదయ్యెను!

"ఎవడో, చలం."

"వా డెక్కడున్నాడు?"

"చచ్చిపోయినాడు."

"మరి ఆ కాయితం మీద 'చలం' అని రాశావే. అదేమిటి?"

మళ్ళీ చచ్చాను. కోర్టుల్లో నేనెందుకు పనికి వొస్తాను?

గద యెత్తాడు.

"నేను. నేనే చలం."

"ఈసారి అబద్ధాలు చెప్పావా, నువ్వీలోకం లోంచి చలిస్తావు. ఎందుకు రాశావు ఆ అబద్ధపు కూతలు?"

"మీరు సంతోషిస్తారనుకున్నాను."

"నేనా?-సంతోషిస్తానూ? ఇది ఇస్తాను." అని కాలెత్తాడు.

"అది కాదు. అసలు మీరు లేరనుకున్నాను."

"లేకపోతే, రామాయణం ఎట్లా వుంటుందిరా."

"వాల్మీకి బుర్రలోంచి"

"నీకు తాత వుండేవాడా?"

"ఆ...."

"నీ తాత యెవడి బుర్రలోంచి పుట్టాడు? నీ తాత లేంది నువ్వెట్లా వున్నావు? నేను లేంది రాక్షసులెట్లా వున్నారు?"

ఈ అర్ధరాత్రి ఆ సమస్యలు ఎందుకంట నాకు?

"ఏరీ రాక్షసులు?"

"ఈ డఫేదార్లు, ప్లీడర్లు, టికెట్ కలెక్టర్లు, పిల్లల్ని బాధించే టీచర్లు పోలీసు యిన్‌స్పెక్టర్లు-వీళ్ళందరూ యెవరు మరి?"

ఆ పది తలకాయల్లో ఏమన్నా సరుకువున్నా లేకపోయినా ఇరవై చేతుల్లోనూ ఇరవై ఆయుధాలూ వున్నాయి. ఎన్ని గుండెలతో అర్గ్యు చెయ్యను? ఒప్పుకుని తలవొంచాను. ఒప్పుకోడంకూడా కష్టమనిపించలేదు.

"సరేలే, ఆ కాయితం చింపు ముందు."

చింపాను.

మళ్ళీ రాసుకోవొచ్చు.

ఇది వరకు చింపినకాయితాలు ప్రేమచూపి చింపించారు. భయపెట్టి చింపించడం ఇదే మొదటిసారి - అందులో మొగవాడి ఆజ్ఞ ప్రకారం చింపడం.

"ఇంక యిట్లాంటి తప్పుడు రాతలు రాయనని ప్రమాణం చెయ్యి."

ఇది పేరు సంగతి. ఆ ప్రమాణంకోసం చాలామంది ప్రయత్నం చేశారు. కాని గదలు చూపలేదు.

ఎట్లా ఎదిరించడం? మర్నాడు పొద్దున గుర్తులేని మాంసపు చలిమిడి ముద్దని ఎత్తి తగలపెడతారు. బహుశా, "చలం" తాలూకు ఐవుండాలని. ఆంధ్రదేశ నీతిశ్రేష్టులకి, నవీన సారంగదరులకి, కలియుగ ప్రవరులకి చాలా సంతోషం సమకూర్చినవాణ్ణవుతాను. ఆంధ్ర సీతలూ, దమయంతులూ, సావిత్రులూ ప్రియుల్ని నిశ్శంకతో కావిలించుకుంటారు. నేనిప్పుడే చావడానికి వీల్లేదు. చెయ్యవలసినపని చాలా వుంది. కొంచెం టిం దీ టెయిలర్ (Tim the tailor) వ్యవహారం సాగించి, ఆ పదిబుర్రల్నీ గడబిడ చెయ్యాలి.

"తప్పుడు రాతలంటే యేవో తెలీటంలేదు. చెప్పండి."

నాతో వాదించ ఒచ్చిన వారిని, "నీతి అంటే యేమిటి?" అని అర్థ ప్రశ్న వెయ్యడమనుకున్నాను!



చూరుకి తగిలే కత్తిని నావేపు వూయించాడు.

"ముందు వినండి; నా సందేహాలు తెలియచేసుకుంటాను. మీకు పది తలకా - శిరస్సులున్నాయి. ఏ ఒక్కదాంతో ఆలోచించినా అర్థమౌతుంది."

"సరేకాని. నాకు నచ్చకపోయిందా, నీ ఒక్క తలా పది తల లౌతుంది."

"ఆలోచించండి-"

ఎట్లా తప్పించుకోడం?

"మీకు కోపమెందుకు? సీత ప్రేమని మీరుకోరారా లేదా?"

"ఐతే?"

"ఆ ప్రేమని పొందారంటే మీకు కోపమెందుకు?"

"ఓరి మూర్ఖా! బుద్ధివిహీనా! ఆమె నన్ను ప్రేమించిందంటే ఆమెకి పాతివ్రత్యమేదిరా"

"పాతివ్రత్యం ఒదల్చాలనేగా మీ గోల?"

"సరేలే. కాని పతివ్రత కానిదాన్ని కోరేటంత అధముణ్ణిరా నేను? నీ తల బద్దలు కొడతా చూసుకో."

"మీరు బద్దలు కొట్టకుండానే బద్దలవుతోంది నా తల, ఈ వింత సమస్యతో................"

"మరి రామాయణమంతా యేమిటి?-ఎందుకు ఎత్తుకొచ్చారామెనీ?"

"మొదట తమాషాకే తీసుకొచ్చాననుకో."

"అంత తంటాలు పడ్డారే!"

"అవును. గొప్ప గొప్ప దేవతాంగనలందరూ నన్ను ప్రేమించారే"

"ఏమో? ప్రేమించారో! మీకు భయపడి నటించారో!"

"ఆ!"

పరశువు ఎత్తాడు.

"ప్రేమించారు లెండి."

"ఆ. మరి ఈ మనిషి నరజాతి - నన్ను తృణీకరిస్తుందా! అదీ నా పంతం."

"మరి ఆ పిచ్చి పంతం కోసమా సర్వమూ నాశనం చేసుకుం
మరి ఆమె మిమ్మల్ని ప్రేమించి వుంటే-"

"ఆ మాటే అనబద్ధన్నాను. ప్రేమించి వుంటే నా గొప్ప యేముం
ఆమె గొప్ప యేముంది?"

"ఏం గొప్పలెండి! దొంగతనంగా రాముడు లేనప్పుడు స్త్రీని యెత్తు
వాస్తిరి."

"ఎదురుగా తెస్తే యాడవడూ? ఏడిస్తే జాలేసి వొదిలేస్తానని భయ
అదిగాక రాముడిమీద నాకేం కోపం? చంపడానికి అవసర మేముంది!"

"కాదులెండి. యుద్ధంలో రాముడేగా గెలిచింది?"

"ఆ! రాముడా గెలిచింది?"

శూలాన్ని యెత్తాడు.

"లేదు. మీరే!"

ముద్గరం యెత్తాడు.

"కాదు, యిద్దరూ-"

పకపకా పదినోళ్ళూ నవ్వాయి.

"రామాయణం చదవలేదురా నువ్వు?"

చదివాను."

"మరి రాముడి చేతనేమయింది? తమ్ముడు - వంశపాంసను
కులద్రోహి. వాడు - నా రహస్యం వెల్లడి చేశాడు గాని! పైగా మీ పురాణా
వాణ్ణి మెచ్చుకుంటారు."

"మీ అన్యాయాన్ని సహించలేక పోయినాడు."

"నేనేం అన్యాయం చేశాను? రాముడు ఎదురుగా వుండగా నేనె
అడగను నన్ను ప్రేమించమని సీతని? అందుకని విడతీసి అడిగాను;
తప్పా? సీతని రాముడేం సుఖపెట్టగలడు? వాడి నష్ట జాతకం. ఏదో
పెట్టి యేడుస్తాడు, యితరుల్ని యేడిపిస్తాడు. సీత! సీత!"

తలుచుకుని కొంచెం మైమరిచాడు.



"ఆమెకి దేవతలు పరిచర్యలు చెయ్యాలి. గంధర్వులు వూడిగం చెయ్యాలి. త్రిభువనాలు ఆమెకి పాదాక్రాంతం కావాలి. రాముడేం సౌఖ్యపెట్టగలడు ఆమెని?"

"కాని మీ విభవాల్ని ఆమె ఆశించిందా?"

"ఆమెకేం తెలుసు? ఇప్పుడు ఏమంటున్నారు మీరు? అదికాదురా, స్త్రీ స్వతంత్రం కావాలంటే, కన్య వరుణ్ని తానే కోరుకోవాలంటే వానికేం తెలుసునంటారే!"

"సీతకేం తెలుసు, నా విభవపు శోభ! అందుకని నయానా భయానా ఆమెకి బోధ పరిచాను. తప్పేముంది? పిల్లల్ని మీరు గదుల్లో బంధించి బోధించటం లేదా? బళ్ళల్లో"

"మీకేం హక్కు వుంది సీ ని బంధించడానికీ?"

"నేను ప్రేమించాను గనక."

"రాముడు ప్రేమించలేడా?"

"వాడిది క్షుద్ర ప్రేమ, నీచ ప్రేమ, స్వార్థ ప్రేమ, నాది వుదారమయింది, వుత్కృష్టమయింది. తనతో కష్టాలు పంచుకోమంటాడు వాడు; నాతో సౌఖ్యాలు పంచుకోమంటాను నేను.నేనైతేనా, ఆ కైకనీ, దశరథుణ్ణీ సముద్రంలో తోసి సీతను సుఖ పెట్టనా? భార్యకన్న తల్లీ, తండ్రీ, ధర్మమూ, కీర్తి ఎక్కువైన వాడి ప్రేమ ఒక ప్రేమా!"

"మరి సీతకి-"

"సీతకీ? సీత కేం తెలుసు ఆడదానికి-"

"రాముడికి-"

"రాముడి కేం తెలుసు, స్వార్థపరుడికి? తన భార్యని యెత్తుకు పోయినానని కోపం తప్ప! నిజంగా ప్రేమేవుంటే వాడు సీతని పిలిచీ 'నీకు నేను కావాలా, రావణుడు కావాలా?' అని అడగడూ."

"మీకు తెలీదూ యెవర్ని యేరుకునేదో!"

"అవునులే. కాని అడిగితే, నేనే యిచ్చేవాణ్ణి సంతోషంతో, ఇద్దర్నీ సర్వలోకాలకీ అభిషిక్తుల్నిచేసి, తపస్సుకు పోయేవాణ్ణి. వాడంత క్షుద్రుడు గనకనే అనుమానాలతో సీతని యేడిపించుకు తింటాడని తెలుసు గనకనే నే నివ్వలేదు."

"ఏం లాభం? మీకు సర్వనాశనమూ అయింది. సీత రాముడికే దక్కింది."

"నా ధర్మం నేను నెరవేర్చుకున్నాను. గీతలో చెప్పినట్లు నిష్కామకర్మ."

"ధర్మమా, కామమా!"

"కామమా!కామమా! నాకేం కామం తీరిందయ్యా?"

"రాముణ్ణి నేను చంపితేమాత్రం, సీత నన్ను వరిస్తుందని ఆశవుంది నాకు? అతని చితిమీదే తానూ భస్మం కాదా? కామమా? నీకేం బుద్ధిలేదు, యిన్ని కథలు రాస్తావు?...."

"ఎన్నడన్నా, యీ లోకంలో, ఒక స్త్రీ కోసం సర్వసంపదల్నీ తమ్ముళ్ళీ, కొడుకుల్నీ, భూచక్రాన్నీ వొదులుకున్న మనిషిని నీవు చూపగలవా. దేవతలచేత, అప్సరసలచేత, మండోదరి వంటి ఉజ్వల చారిత్రచాత వరింపబడ్డవాణ్ణి నేను!"

"ట్రాయ్‌కథ వుంది."

"తెలుసు నాకు. అక్కడ స్త్రీని అనుభవించాడు. "పారిస్'నేనూ, నేనూ!...." అంటూ యేడ్చాడు పదినోర్లు వణుకుతో.

"ఒక్క చిరునవ్వునన్నా పొందలేదే! ఆమె నా విమానంలో కూచున్నదే చాలు. నా తోటలో వసించిందే చాలు అనుకున్నాను. నాకేమీ ఆశలేదు. అఖ్కర్లేదు. ఆమె ఏమీ ఇవ్వదు. కాని, కాని....

అంతకన్న ఉన్నతమైన ప్రేమని. యోచించుకో!"

నేను చాలా మూవ్ (Move) ఐనాను, కాని అర్గ్యుమెంటు కోసం....

"ఏం ప్రేమలే! ధర్మవరుడైన విభీషణుడు కూడా ఎందుకు ఒప్పుకోలేదు, మరి అప్రేమే గొప్పదైతే!"

"ఆలోచించాలా-ఆలోచిస్తా. ముందు ఆ సిగరెట్ పెట్టె ఇట్లా పడెయ్యి."

అవును. నా గాబరాలోఆతిథ్యమే మరిచిపోయినాను. ఎక్కడ కూచోమనను? ఏ కుర్చీ ఆగుతుంది?

సిగరెట పెట్టె యిచ్చాను.

"లాడి తెడున్నావు. నీకు కత్తెరమార్కు చాలదూ, ఏనుగుమార్కు కావలసి ఒచ్చిందా?" అన్నాడు.



అంటో, నాలుగు చేతుల్లోంచి శక్తీ, శూలమూ, ఖడ్గమూ, ముద్గరమూ నా బల్లమీద పెట్టి, నాలుగు చేతులతో ఎనిమిది సిగరెట్లూ తీసి, యెనిమిది నోళ్ళల్లోనూ పెట్టాడు.

"ఇంకా తే. బుద్ధిలేదూ?"

అన్నాడు మిగిలిన రెండు నోళ్ళతోనూ.

"ఇంక లేవు"

"లేవూ? లేకండా యేం చేస్తున్నావు?"

పరశు యెత్తాడు.

"రామ రామ" అని భజన మొదలు పెట్టాను. రెండు మూడు కారణాలవల్ల-కాని సీత నంటగట్టానని రావణుడికే కోపం ఒచ్చిందే, యింక రాముడా నన్ను కరుణించేది? అతని పక్కనే రాముడు ప్రత్యక్షమై. రావణుడి బుజంమీద ప్రేమగా చెయ్యివేసి-

"సందేహిస్తావేం? వెయ్యి ఒకటి" అంటాడనుకున్నా. ఆ వెనక సీత నుంచుని "వాణ్ణి నాశనం చెయ్యి రావణా! అప్పుడుగాని నాకు కసితీరదు ..." అంటే!

"ఏమాలోచిస్తున్నావు?"

అని దువ్వాడు మీసం. నా ఒక్క మెదడూ చాలా చురుకుగా పని చేసింది. ఆ నాలుగో తల కుడిమీసం మూడు మెలికల్నీ చూసి.

"బజారుపోయి కొనుక్కొస్తాను" అని బృహస్పతిమల్లే పలికాను,

"ఆహా! అదే పోక పోదామనా! వీల్లేదు."

"నా కేవన్నా మంత్రాలు తెలిసి వుండకూడదా?"

చుట్టూ చూశాను. ఏవన్నా పాత సిగరెట్లు, సగం కాల్చిన ముక్కలన్నా వున్నాయేమోనని. అంత్యకాలంలో తెలివి యెక్కువవుతంది అంటారు. "సెల్' కదిలింది. శేషమ్మా, నన్ను రక్షించావు. వరండా నిండా వుమ్ము వేసినందుకు నిన్నెప్పుడూ తిట్టను!

"తమకు కోపమొస్తుందేమో!"

"కానీ..........."

"బీడీలు తాగుతారా?"

"బీడీలు తాగుతావురా! బ్రాహ్మడివి!"

"బ్రాహ్మణీకం ఒదిలేశానండి. తమకు తెలీనిదేముంది? కాని ఆ నాస్ బ్రామిన్సు నన్ను చేరనీలేదు. గొప్ప వుద్యోగం కొట్టేస్తానేమోనని!"

"సరేలే. అసలు బ్రాహ్మణ పుటకేగా! బీడీలెట్టా తాగుతావు! ఇంత పాడైన వాడివా? నువ్వు బతకడానికి వీల్లేదు."

శూలం యెత్తాడు.

"కాదు. నేను కాదు. శేషమ్మ తాగుతుంది."

"ఆడదాన్ని తాగనిస్తావురా?"

"ఆమె నా పనిమనిషి, నా పెత్తనం యేముంది?"

"అంట్ల వెధవా! ఆడదానిమీద పెత్తనం లేనివాడివి, సీతని నా ఒళ్ళో కూచోపెట్టావా?"

శక్తినెత్తాడు.

"నేను కాదని మనవి చేసుకున్నాను."

"ఐతే యెవరు."

మళ్ళీ మొదలా!

"ఇంకొకడు."

"వాణ్ణి తీసుకురా."

"దొరకడు."

"ఆ శేషమ్మ యెవరు?"

"పని మనిషి."

"ఏం కులం?"

"తెలీదు."

"ఎందుకు తెలీదు?"

"నే నడగలేదు."

"ఎందుకు అడగలేదు?"







"ఏం అవసరం?"

"అదికాదు. ఆడదాన్ని చూస్తే నీకు భయం. నీ భార్య యేదీ?"

"మా వూళ్ళో వుంది."

"ఎందుకు తీసుకురాలేదూ? ఎవరాన్న యెత్తుకుపోతే!"

"ఈ కాలపు రావణులకి ఆ మాత్రం సాహసం లేదు."

"ప్రేమవుంటే సాహసం ఒస్తుంది."

"పెళ్ళాల్ని ఎత్తుకుపోతే రెండేళ్ళు శిక్ష!"

"ఈనాడే ఐతే మీకైనా అంతే."

"ఆ. నాకు శిక్షా! ఒరే నీ నాలిక కొవ్వింఁదే! ఆ ప్రయోజకుడివిరా నువ్వు! ఇట్లాంటి పాడుకథలు రాస్తావు గనకే నీతో ఎవరూ వుండరు. ఈ బీడీలు తాగే శేషమ్మ తప్ప. నిన్నింక బతకనీకూడదు. ఎట్లానూ చంపుతాను నిన్ను. ఆ బీడీ లిట్లా పారెయ్యి."

"సగం కాల్చినవి."

"నోరుముయ్యి. ఇట్లా పడెయ్యి, అట్టే వాగక."

వెతికి యిచ్చాను.

రెండూ మిగిలిన రెండు నోళ్ళల్లోనూ పెట్టాడు. అగ్గిపెట్టె యిచ్చాను. సిగరెట్లూ ఎనిమిదీ వెలిగించాడు. బీడీలు వెలిగించబోతున్నాడు.

"అయ్యా, మీసాలు కాలతాయి."

"అగ్ని నన్ను తాకడమే!" అని గర్జించాడు. పదినోళ్ళలోంచీ పొగలు! ఆ రూపం చూడలేక నవ్వు ఆపుకుంటున్నాను. అధిక ప్రయత్నంతో.

"ఆ శేషమ్మ యేదీ?"

"ఇంటికి పోయింది."

"ఉంటేనేం?"

"నీతి భయం."

"ఇంకా వుందీ ఆ భయం?"

"ఈ కాలంలో అగ్ని పరీక్షలు కూడా లేవు."

"సరేరా, నేను పోవాలి. దేంతో చస్తావు నీవు - అస్త్రంతోనా, శస్త్రంతోనా

"..................."

"తొరగా కానీ."

ఎట్లాగో కాలయాపన చెయ్యాలి.

"అస్త్రానికీ, శస్త్రానికీ భేదం ఏమిటి."

"చూపించనా?"

"ఎందుకండీ నన్ను చంపడం?"

"మరి సీతని నా చితిలో యెందుకు తోశావు?"

"విభీషణుడా? వాడు! అంత దుర్మార్గుణ్ణి ప్రపంచం యెరుగునా వాడు ధర్మాత్ముడూ, నేను దుర్మార్గుణ్ణీ ఐనాను కాదూ! అందువల్లనే మీ దేశం యిట్లా ఏడుస్తోంది. పిరికి వెధవ. మొదటినుంచీ అంతే. అర్భనాకార వెధవ. ఎప్పుడూ భయమే! చెట్టెక్కితే పడతానని ఏడ్చేవాడు. శకునపక్షి లాగు కూస్తూనే వుంటాడు....ద్వాపరంలో మీ భీష్మద్రోణులు పాండవుల వేపు చేరారా! ధర్మంగాని ఆధర్మంగాని ఎవడి తిండి తిన్నారో వాడివేపే వచ్చారు. మ విభీషణుడో! కులద్రోహి. ఇంకా వాణ్ణి మెచ్చుకుంటున్నావా."

"భీష్మాదులు మాత్రం రహస్యంగా పాండవులకి సహాయం చెయ్యలేదా?"

"అందువ్లనే పూజ్యులైనారు మీకు. స్వామిని నమ్మినవాళ్ళకి గౌరవం లేదు మీ దేశంలో! ఇట్లాంటి దేశద్రోహుల్ని గౌరవించే శాస్త్రాలు చదివే, మీ రాజులందరూ విరోధులతో చేరి దేశ ద్రోహులైనారు. ఈనాటికి అట్లాంటి వాళ్ళకే గౌరవమూ, మెప్పూ"

నోరు మూసుకున్నాను.

"ఏం రా?"

"కాని పర దారాపహరణం-"

"ఇంకా అదే కూస్తున్నావు? చావు" అని గదతో నెత్తిమీద ఒక్క పెట్టు పెట్టారు.

వులిక్కిపడి లేచాను. లైటు మండుతోంది. ఎంత సేపు నిద్రపోయి నానో!

★ ★ ★

# బోగంమేళం

పెళ్ళి భోజనంచేసి తాంబూలం వేసుకుంటున్నారు. రాత్రి తొమ్మిదిన్నర అయింది. ఈ పాటికి లేచి పోవలసిందే ఎవరిళ్ళకు వాళ్ళు. కాని, బయటవాన కురుస్తోంది. కారున్న వారదృష్టవంతులు. వారు మాత్రం గొప్పగా వెళ్ళిపోయినారు.

"వాన వెలిసేటట్టు లేదు. ఏం చేద్దాం."

"ఈ ముదనష్టపు బిల్లు రాకపోతే మనవాడు బోగం మేళం పెట్టేవాడే? ఏం సాంబయ్యా! హాయిగా ఇప్పుడు ఆడించుకుందుము."

"తప్పకుండా, ఏమిటా బిల్లు? బోగం మేళాలు పరిపాలనకేం అడ్డమెచ్చాయ్!'

"నీతి ప్రభుత్వమోయ్:!"

"మేళాలకీ, నీతికీ సంబంధం!"

"వాళ్ళు అట్లా బహిరంగంగా అడితే చూసిన వాళ్ళలో...."

"తెలివి తక్కువగా మాట్లాడకు. ఇంకా బోగంవాళ్ళు చీరెలు కప్పుకొని ఆడతారు. భరత నాట్యమని పేరుపెట్టి పైనో గుడ్డా, కిందో గుడ్డా కట్టుకుని పసిపిల్లలూ, ముసలమ్మలూ రంగులు పూసుకుని, సినిమాల్లోనే కాదు. గవర్నర్ల ముందు కూడా తైతక్కలాడితే, చాలా బావుంది-ఏం?"

"కాని; వాళ్ళు వేశ్యలు కాదుగా?"

"వేశ్యలకి డబ్బు చెల్లించుకోవాలి. వాళ్ళకు అదీ అఖ్కర్లేదు?"

"అసలు అది కాదురా. ఈ బోగం కులానికి అది అవమానమని."

"పాకీవాళ్ళని రద్దు చెయ్యరేం?"

"కౌన్సిలు మెంబర్లకి ఇబ్బందికదూ; అందుకని."

"ఇదీ ఇబ్బందే! కాని, బయటికి ఆమాట, సభలో అనే ధైర్యం పోయింది."

"ఈ బిల్లు చేసిన వాళ్ళు వ్యభిచార చరిత్ర ఎవరన్నా చదివారంటావా? ఏదో కీర్తి కోసం చేసిన పనులు తప్ప".

"ఇట్లాంటి బిల్లులు చాలా అపాయకరం. పాకీవాళ్ళని రద్దుచేస్తే వాళ్ళ పనిని యంత్రాలన్నా చెయ్యాలి. లేకపోతే ఎవరికి వారన్నా చేసుకోవాలి. వేశ్యల పని యంత్రాలు చేయలేవు. కనక సంసార స్త్రీలే చేస్తారు ఆ పని. మనుష్యులు వుత్త యంత్రాలనీ, తక్కిన శక్తుల మల్లేనే మనుష్య స్వభావాన్ని కూడా అధీనంలోకి తీసుకురాగలమనే ఉద్దేశ్యం బయలుదేరిందోయ్! నాజీజం, కమ్యూనిజం సిద్ధాంతమది" అన్నాడు కాలేజీ ప్రిన్సిపాల్.

"తక్కిన దేశాల్నించన్నా పాఠాలు నేర్చుకోరు. మనం చరిత్రని బోధిస్తాం. కాని, చరిత్ర నుంచి ఏమీ నేర్చుకోము."

"మన దేశ ప్రజలు వేరనేగా మొదటి నుంచీ కాంగ్రెసువారి వాదన. మన ప్రజలకి తాగుడు లేకపోయినా ఇబ్బందిపడరు. ఏదో బోగం వాళ్ళు ఉన్నారు గనక వాళ్ళ మీద దయతలిచి ఉపయోగించుకుంటారు గాని, అసలు అటువంటి బుద్ధేలేదు. భారత స్త్రీకి ఎంత స్వతంత్రం వచ్చినా సీతా, దమయంతుల మూర్తుల్ని హృదయంలో ఆరాధిస్తే, పతి సేవలోనిమగ్నమై వుంటుందనే కద?"

"మొన్న నాక్లయింటు వెంకయ్య అంటున్నాడు. ఈ బిల్లు రావాలని. తన కులానికి తమ సంస్కరణ నాయకుడు కావాలని అతని ఆశలే. చాలా తంటాలు పడ్డాడు, ఈ బిల్లు కోసం. ఇదేమిటండీ, బిల్లు పెట్టించి పెళ్ళి చేసుకోమంటే, ఈ..........లు పెళ్ళి అని ఏదో చేసుకుని, సంపాదన యథాప్రకారమే సాగించారూ!"

"ఏమోగాని, పెళ్ళిళ్ళలో బోగం మేళాలు తీసెయ్యడం చాలా మంచి పని చేశారు" అన్నాడు రాజారావు.

"ఏం?"

"చాలామంది మనుషుల్ని పాడు చేస్తాయండి. పెళ్ళి హడావిడిలో దంపతులు యెడమై వుంటారు. అదీగాక మంచి భోజనం, అత్తరూ, సంగీతం, బనారసు చీరెలూ....చాలా ఉద్రేకంగా వుంటుంది.పైగా ఎదురుగా నడుములూ, కళ్ళూ తిప్పతో వీళ్ళూ."

"హాలిడే స్పిరిట్ అంటావు."

"మరి ఈ సంగతి యోచించు. ఈ బోగం వాళ్ళన్నా యెదురుగా లేకపోతే, పెళ్ళి హడావిళ్లో ఎవరు ఎవరి పెళ్ళాలో గుర్తులు తప్పిపోతాయి.

"అంతే కాదు. చాలా త్వరలోనే భరతనాట్యం వాళ్ళని పిలిపించి నృత్యాలు చేయించుకుంటారు."

"నిజంగా జరిగిన ఓ కథ చెబుతా వినండి-వాన తగ్గలేదు ఇంకా. కాలేజీలో చదువుకుంటున్నాం. నా ప్రాణస్నేహితుడు, రూంమేట్, ప్రభాకరం పెళ్ళికి వెళ్లాను. ఎవరికంటావు? హైకోర్టు జడ్జీ కూతురికి. ఉద్దండుడు ఆయన. కూతురికి



శరీరావసరమనిగాని, లేకపోతే పెళ్ళి చెయ్యడమనే తక్కువ స్థితికి దిగడనుకో. పదివేలు కట్నం మా బీద ప్రభాకరానికి. ఒక్కతే కూతురు గనక, ముందు ముందు ఆస్తికి హక్కుదారుడు మా వాడు. కాని, మేం తర్లి వెళ్ళిన నాటినించీ, మమ్మల్ని యేదో ముష్టివాళ్ళమల్లే చూశాడు ఆ జడ్జీ. అన్ని సౌకార్యలూ గొప్పగా వున్నాయి. కాని ఆ వాతావరణం, "మీవంటి వాళ్ళని నేను ఆదరించాల్సి వొచ్చింది. నా కూతరు కారణంగా' 'అన్నబాధ. ఈ జమీందార్లు చూడు-మర్యాద చేస్తారు-అట్లా. మర్యాదే; మిమ్మల్ని మర్యాద చెయ్యకపోతే, మా మర్యాదకి లోపం కనక మిమ్మల్ని మర్యాద చేస్తున్నాం. అంతేగానీ......... ఎంత దొంగతనం అంటావు. అందరి కంటె యెక్కువ వినయం చూపుతారు. కాని, ఆ వినయం వెనక చాలా గర్వం. జమీందార్లే అఖ్కర్లేదు. వాళ్ళ దగ్గిర నాలుగేళ్ళు వున్న వాళ్ళకి కూడా వొస్తుందది. అవును. గాయకుడివి, నీ దగ్గిర కళవుంది గనక, కళని ఆదరించే ప్రభువుని నేను గనక, నిన్ను గౌరవం చేస్తున్నాను. అంతేగాని-నువ్వూ, నీ సంగీతం.... అన్నట్టు వుంటుంది, ఆ జడ్జిని చూస్తే నాకు. మేము యువక పురుగులం. అతని అల్లుడితో సహా. 'మీ మొహం, లక్ష జన్మలెత్తితే మీరు జడ్జీలు కాగలరా?' అంటున్నాయి అతని కళ్ళు.

ఆ జడ్జీగారికి ఓ తమ్ముడు వున్నాడు. అతను రసికావతంసుడు. జడ్జీ గారిని అడక్కండానే ఓ బోగం మేళంతో సహా దిగాడు పెళ్ళికి.

ఆయన వేశ్యాప్రియురాలికి ఓ పదహారేళ్ళ కూతురు వుంది. ఆ కూతుర్ని ప్రకటించి, పైకి తీసుకురావాలని ఆయన ప్రయత్నం. తీరా బోగం మేళం వచ్చింది గనక, ఆమెని వీలైనంత వుపయోగించుకున్నారు ఆపెళ్ళిలో. ఆ అమ్మాయి పేరు రాధ, ఆ రాధ వంక సరిగా చూపన్నా పడనీడు ఆ జడ్జీ తమ్ముడు. నిజంగా చాలా అందం - అందమే కాదు. ఆమెలో ఓ గుణం వుంది. తల్లిలోనూ వుందిలే! అదే జడ్జీగారి తమ్ముణ్ణి ఆమె గుమ్మానికి కట్టేసింది అనుకున్నాం. రాధను చూసేవాళ్లకి ఆమెను కావలించు కోవాలనిపిస్తుంది. కావలించుకుంటే ఆమె ఏమీ అనదనీ, కావలించుకోమని ఆహ్వానిస్తోందనీ, రూఢిగా తెలిసినట్టవుతుంది. చాలామంది స్త్రీలలో వుంటుంది కొద్దో గొప్పో ఇది. ఆ ఆకర్షణ వుండడంవల్ల ఆ స్త్రీలకీ సుఖమా, కష్టమా, అంటే-ఆ సంగతి వాళ్ల తక్కిన గుణాల మీదనో, జాతకం మీదనో ఆధారపడుతుంది. ఏమయితేనేం, రాధ సంగతే మాట్లాడడం ఆ పెళ్ళిలో అందరూ. పైగా ఆమె పాడడం, ఆడడం, జాపశీలు అభినయం, ఆహ్వానం, వేళ్ళు, చేతులు, రొమ్ము నించి కాంతులు మా మీద ప్రయోగించడం, మా కోర్కెల్ని అణుచుకోలేక చాలా బాధపడ్డాం. పైగా ఆ జడ్జీ తమ్ముడు మా బుజాలమీద కొట్టి మాతో రాధని వర్ణించడం; ఆమె ప్రతిభ సంగతి గమనించామో లేదో, మా వెంటబడి అడగడం! కాని మేము ఆమె వొంకనన్నా చూడకండా ఆమెని దాచెయ్యడం.

ఆ జడ్జీ తమ్ముడు రాధ అనాఘ్రాత పుష్పమనీ, అట్లానే వుంచి కళకి ఆమె అంకితం చెయ్యబోతున్నాననీ, పెళ్ళిసభలలో ప్రకటిస్తున్నాడు. ఎవరన్నా గట్టిగా ఆ అమ్మాయివంక చూస్తే కొట్టడానికి సిద్ధమయేవాడు. బోగం వాళ్ళకంతా వేరే గదులు మేళంలో తక్కినవాళ్ళూ, ఆయన రాధకి కాపలా. ఇది ఇట్లా వుంటూండగా, పెళ్ళి మూడోరోజు పొద్దున హడావిడి పెళ్ళికొడుకు కనపడలేదని. ఇంకొంచెం సేపటికి ఇంకో మూలనించి రాధ కనపళ్ళేదని."

అని కథచెప్పి రాజారావు మాట్లాడకుండా సిగరెట్ ముట్టించి దిండుమీద వాలాడు. నాలుగు నిమిషాలు చూసి-

"అంతేనా కథ? అన్నారు ఒకరు.

"అంతకన్న ఏం కావాలి? బావుందా?"

"సరేలే. తరవాత?"

"తరవాత ఏముంది? ఎంత వెతికించినా కనపళ్ళేదు వాళ్ళు. పెళ్ళికొడుకుకి ఇచ్చిన పదివేలూ, వెండి పళ్ళాలూ లేవు. జడ్జీగారి తమ్ముడు చేయించి యిచ్చిన రాధవి మూడువేల నగలూలేవు. నా మిత్రుడేమైనాడని నేను గొడవపడ్డా, జడ్జీ కళ్ళ నురుగులు చూడ్డం నాకు చాలా వోదార్పు నిచ్చింది. బలేపని చేశాడు అనిపించింది. పైగా స్త్రీ విషయికంగా చూస్తే, జడ్జీగారి కూతురికన్న రాధ ఎంత గొప్ప! ఆమె మ మీద వెదజల్లిన మత్తు, ఆకర్షణ, ఆమె పడకగదిలో చూపిందా మా మిత్రుడంతటి అదృష్టవంతుడు లేడని గర్వపడాలో లేక వాడికి ఆమె సందిటనింక ముక్తి వుంటుందా అని విచారపడాలో తెలీలేదు" అని మళ్ళీ వూరుకున్నాను రాజారావు.

"తరవాత?"

"అంతే!"

"జడ్జీగారు?"

"పెళ్ళి రద్దు చేయిస్తానని, కూతురికి మళ్ళీ పెళ్ళి చేయిస్తానని చిందులు తొక్కాడు. నవ్వాము ఆయన మొహనే. కాళేశ్వరరావుగారు ఇంకా జైలులోనేవున్నారు ఆనాటికి."

"పెళ్ళికూతురు."

"నామల్లేనే ఆమె ముసలిదౌతోంది. ఇప్పుడు, మిసెస్ అని ముందర వేసుకుంటుంది. కౌన్సిలు మెంబరు. మొన్న ఈ బిల్లుని చాలా ప్రోత్సాహ పరిచింది."

"వాళ్ళిద్దరూ?"

రాజారావు కొంచెం వూరుకుని-



"చెప్పమంటారా? తరవాత పదేళ్ళకి గావును మీ వూళ్ళో కాఫీ హోటలులో కనపడ్డాడు మా పెళ్ళికొడుకు, ఇద్దరం గుర్తుపట్టుకోగలిగాం. అతను ఆ వూళ్ళో రాధతోనే వున్నాట్ట. కొంచెం "సిడీ"గా అయినాడేమో ననిపించింది. కాని, ఏం చెప్పలేను. మామూలుగానే వున్నాడు. అంతే ఘనకార్యం చేసినట్టుగాని, అంత రసికురాల్ని అనుభవించినందుకుగాని అతనిలో మార్పేమీలేదు. దరిద్రమూలేదు, ధనమూలేదు. అప్పుడడిగాను-

"ఏం జరిగిందిరా? ఎందుకు వచ్చేశావు?"

"ఏంలేదురా. పెళ్లికొడుకుని గనక రాధతో పరిచయం సులభమయింది. పెళ్లికొడుకు గ్లామర్ రాద మనసులో పనిచేసిందిగావును." సరేలే, ఎందుకు మాయమైనావు".

"నీ కా వీలు కలిగితేనువ్వు పారిపోయి వుండవా?"

"ఏమోలే, అంత వరకూ రానివ్వనేమో."

"ఎంత వరకు?"

"అన్నిటినీ, అందరినీ వొదిలి పారిపోయేటంత వరకు."

"అంటే జీవచ్ఛవానివి గనక."

"సరేలే. ఆ అమ్మాయి ఎందుకు వచ్చిందిరా?"

"ఏమిటో! చాలాకాలమైంది. మరిచిపోయినాను. పినమామగారిని తప్పించుకొని రాధ గదిలోకి పోయి, ఆమె నాట్యాన్ని పొగుడుతున్నాను. దగ్గిరగానుంచుని, "ఏదో అందరూ అంటారు, ఆ మాట" అంది. నేను ప్రత్యేకంగా అంటున్నానని ఆమెకి చెప్పేమార్గం, నాకు అదితప్ప ఇంకో మార్గం కనపడలేదు. అంతేననుకుంటా. ఆ విధంగా తప్ప స్త్రీమీద ఇంకో విధంగా గౌరవం కనపర్చలేమనుకో. అది వీలుండగా, వయసులో వుండగా, తక్కిన పొగడ్తలన్నీ వుత్త సారంలేని మాటలు. ఆమె అందం చూశావుగా! తనే నన్ను రాత్రి జడ్జీగారి స్టడీ గదిలో కలుసుకోమంది. అక్కడా సోఫామీద నాట్యమాడిందనుకో. ఇంక ఆమె లేకండా బతకలేనని ఆ రాత్రే సోఫామీదే తెలిసిపోయింది నాకు. తరవాత పారిపోవడమా-? జీవితంలో ముఖ్యమైన మార్పులు జరిగే సంగతులు ఎందుకు చేశామో, ఎప్పుడూ అర్థం కాదనుకుంటా."

"సరేకాని, ఇప్పుడేం చేస్తున్నావు?"

"ఏంలేదు. ఆ డబ్బు జాగ్రత్తగా వొడ్డీకి వేశాం. బాగానే బతుకుతున్నాం."

"రాధ వుందా నీ దగ్గిర? వాళ్ళ బంధువులు గోలచెయ్యలేదా?"

"మాకు తెలిసినవాళ్ళల్లో నిన్నే మొదట చూడడం."

అదేదీ నాకు బావుండలేదు. మిత్రుడు సుఖంగా వున్నాడంటే సంతోషమేగా ఇల్లాంటి వ్యవహారాలలో, దరిద్రంలో కుమలడమో, ఇద్దరిలో ఒకరు రెండోవారి పంపించడమో, ఏం చేశామా అని తీవ్రపశ్చాత్తాపమో ఏదో ఒకటి జరగకపో స్వకీయంగా అపరాధం జరిగినట్టుంటుంది. ఎందువల్లనో? అది మనలోని ఈర్ష్యవల్ల మన ఆలోచనల అలవాట్లవల్లా, చిన్నప్పటి బోధనలవల్లా, ఏమోమరి- హరిశ్చంద్రుడట మాలకొలువులోనే వుండిపోయినట్టు నాటకం అంతమయితే భరించగలమా రావణుడు సీతని రాణీ చేసుకుని లంకని ఏలాడంటే వొప్పుకుంటామా? ఫిల్ము మనిషిని చంపిన వాడు సుఖంగా తప్పించుకుని ధనవంతుడై నాడంటే? ఇదీ అంత

నాలుగయిదు రోజులు ఆ వూళ్ళోనే వున్నాను. అతను తన ఇంటికి రమ్మ పిలుస్తాడేమో ననుకున్నాను. కాని, పిలవలేదు. రాత్రిళ్ళు హోటల్లో పడుకు ఆలోచించుకునేవాణ్ణి. ఆ రాధ అందాన్నంతా ఎంత గొప్పగా అనుభవించాడో ఇంకా అంత గొప్పగానూ చూసుకుంటున్నాడా అనే ప్రశ్నలు వొచ్చేవి. కాని, అతన్ని ఆ మా ఎట్లా అడగను?

మర్నాడు హోటల్లో అతన్ని కలుసుకున్నప్పుడు అతని వంక ఇంకా పరీక్ష చూశాను. అతని ఒంటిమీదా, బట్టలమీదా అశ్రద్ధ కనపడుతోంది. మరి,యే ఉద్యోగమూలేని మనిషికి అంత శ్రద్ధ యేముంటుంది? కళ్ళలో కూడా ఉత్సాహమూ, ఆశాలేవు, కాని-దిగులూ, నిరాశా కూడా లేవు; బాధాలేదు. కాని, ఇత జీవితమే మామూలుగా నడిచివుంటే ఈ పాటికి జడ్జీగారి లక్షల ఆస్తి, ఆయ మూలంగా మళ్ళీ ఇతను ఈ పాటికి ఓ జడ్జీ కీర్తి, పిల్లలూ, గౌరవం, కార్లు! ఆ నిమిషం వ్యామోహానికి లొంగిపోయి, కలకాలం సంపదానుభవాన్ని, మర్యాద పోగొట్టుకొని ఒంటరి బతుకు బతుకుతున్నాడు ఈ వూళ్ళో ఏ చిన్న ఇంట్లోనో కాపరం ఈ హోటళ్ళల్లో ఆ గుంపులో పనిలేకుండా తిరుగుతూ, బతుకుతూ. బుద్ధిలో కూడా ఏ వికాసమూ కనిపించలేదు. పైగా లోపల చచ్చే సిగ్గుపడుతో వుంటాడు.

"ఏం చేస్తావు పొద్దస్తమానం?"

"ఏం లేదు. ఇల్లానే."

"పిల్లలా?"

"లేరు."

"ఏమన్నా చదువుతావా?"

"ఏం చదవను"

"న్యూస్ పేపరూ?"

"ఉహూ."





"ఎందుకు చదవవూ?"

"నాకేం సంబంధం?"

"ఏం పని చేశావోయ్! ఈ పని చెయ్యకపోతే ఈ పాటికి ఎక్కడ వుండేవాడివో తెలుసుకోగలవా."

"ఊ."

"దిగులెయ్యదా?"

"అప్పుడప్పుడు."

"మరి రాధ ఏం చేస్తోవుంటుంది."

"వంటా, పొరుగువాళ్ళూ, కబుర్లూ, ముఖ్యంగా నేనూ."

"ఆమె జీవితం మాత్రం ఎంత పడిపోయిందో తెలుసుకుంటుందా? ఆమె అందంతో, నాట్యంతో ఈ పాటికి...."

"అవును."

"దిగులు పడుతుందా?"

"అప్పుడప్పుడు"

-అని ఆగాడు. కాఫీ తాగుతూ ఆలోచిస్తున్నాడు. మొదటిసారి తన జీవితం సమగ్రంగా నా కళ్ళలోంచి చూసుకుంటున్నాడనిపించింది. కొంచెంగా పూర్వపు పట్టుదలా, కొంటెతనం ఒచ్చాయి అతని కళ్ళల్లోకి.

"ఇన్నేళ్ళూ నువ్వేం చేస్తున్నావు?" అన్నాడు.

"ఏం చేస్తున్నాను? ప్లీడరీ. పన్నెండెకరాల పొలం సంపాయించాను, ఓ యిల్లు కట్టాను. నలుగురు పిల్లలు. మా వూళ్ళో కొంత పేరు. నాకేం?"

"ఏం, తృప్తిగా వుందా?"

"ఏమి?"

"కొంత ఆస్తి సంపాయించి, కొంతమంది పిల్లల్ని పెంచుతున్నావు నువ్వు చేసిన మహత్కార్యం ఏమిటి?"

"ఏం, అంతకన్న మనుషులు యేం చెయ్యాలి?"

"అవును. అంతేలే. కాని-అంతకన్న ఏదో చెయ్యాలనే ప్రయత్నించాను నేను."

"ఏం చేశావు; నా అంతమాత్రం చేయలేదు కద?"

"పోనీ, చెయ్యలేదనుకో. కాని, నేనే మామూలుగా వుండిపోతే నేనూ నీ మల్లే కొంత ఆస్తి సంపాయించి పిల్లల్ని పోషించే వాణ్ణి."

"కాని, నీ వల్ల ఎవరికి ఏం ఉపయోగం ఇప్పుడు?"

"నీ వల్లా? నువ్వు లేకపోతే వ్యాజ్యాలు వుండవా, ఆ ఆస్తిని అనుభవించే వాళ్ళు ఉండరా? పిల్లల్ని పెట్టి జనాభాని పెంచే వాళ్ళకి తక్కువా?"

"కాని, పిల్లలూ, వాళ్ళ చదువులూ, పెళ్ళిళ్లూ...."

"అవును. వాళ్ళని కన్నావు గనక ఆ బాధ్యతలు. అవేవో లోకానికి ఏదో గొప్ప ఘనమైన ఉపకారాల్లా మాట్లాడతావేం?"

ఆ సాయంత్రం అతను వెళ్లాక ఆలోచించాను. అతని మాటల వల్ల నాకు అతని మీద కోపం ఎక్కువైంది. ఏమిటితను? జీవితపు మామూలు బాధ్యతల్ని ఎగగొట్టడానికి అతనికేమి హక్కు వుంది? ఇంక తన సంగతేనా? ఎంత స్వార్థం! అతని కళ్ళు తెరవడం నా ధర్మం అనిపించింది.

మర్నాడు కాలవ గట్టకు షికారుకు వెళ్లాం.

"మరి నువ్వు పెళ్ళి చేసుకుని వొదిలి వచ్చిన అమ్మాయి సంగతి ఏమన్నా యోచించావా?"

"ఎట్లా వుంది? ఏం చేస్తోంది?" అన్నాడు. అప్పుడు అడిగాడు దూరంగా. తాను పెళ్ళి చేసుకున్నానని మరిచేపోయినట్టున్నాడు.

"ఏం లేదు. తండ్రి ఆస్తినంతా ఆమెకు ఇచ్చాడు. ఏదో సంఘ సేవ చేస్తో పబ్లిక్ లైఫ్‌లో ప్రాముఖ్యత సంపాయించుకుంటోంది."

"ఇంకేం!"

"ఇంకేం? ఇంక గతిలేక, ఏం చేస్తుందిమరి?"

"ఏం తక్కువయిందంటావు? మొగవాడూ, పిల్లలేనా? డబ్బు వుంది కదూ? కొంచెం సాహసిస్తే అవిమాత్రం లభించేవి కాదా?"

"అందరూ నీ మల్లే అనుకున్నావా?"

"కాదులే-పోనీ, హాయిగానే వుందిగా. నీకేం దిగులు?"

"ఏం దిగులేమిటి? ఆమె లోపల లోపల ఏం బాదపడుతోందో...."

"బైట బాధలు చాలవూ-బైట సుఖంగా వున్న వాళ్ళు లోపలయెంత బాదపడుతున్నారో యోచించేందుకు? యీ వుత్త కబుర్లుమాట్లాడకు. పోనీ, ఏ బాధలన్నా ఎవరివన్నా పోగొట్టడానికి నువ్వెన్నడన్నా ఏం చేశావో చెప్పు. నే నన్యాయం చేశాననే కోపం వల్ల, ఆమె లోపలి బాధ లేమిటో అని దైన్య పడుతున్నావుగాని, నీ కూతురు [illegible]వయితే, నీకూతురి భర్త వొదిలితే ఆమె కోసం బాధపడతావా?"



"ఆఁ.కాని, నివారించే మార్గంలేక ఊరుకుంటాను."

"నివారించేందుకు నేను ఒక్కణ్ణె కనపడ్డానన్న మాట. ఒక మార్గం తెలిసి కూడా, ఏం చెయ్యగలను అనేవాళ్ళ దయలో నాకేం విశ్వాసం లేదు."

"నే ననేది. పోనీ రారాదా అని."

"ఎక్కడికి?"

"ఆమె దగ్గరికి; నీ భార్య యింటికి."

"వొచ్చి?"

"వుండూ."

"ఇప్పుడు ఆమెకి నేనెందుకు?"

"నేను మాట్లాడుతానుగా."

"కాని, రాధని నేను ఒదిలేసి ఒస్తే దాంటో అన్యాయం నీకేం కనపడదనుకుంటాను;"

ఆలోచించాను.

"పోనీ, తెచ్చుకో, ఇద్దరూ ఉండనీ."

"ఏమో! ఆమె ఒప్పుకోదు. రాధ ఒప్పుకోదు."

"ఆమెతో, ఈమెతో నేను మాట్లాడతాను. అన్ని ఏర్పాట్లూ చేస్తే నీకేమన్నా అభ్యంతరమా?"

"ఇంత శ్రమ నీకెందుకో! ఎవరి మీది దయవల్ల ఈ ఏర్పాటంతా?"

"ఒక్కటడుగుతా. నిజం చెప్పాలి" అన్నాను.

"ఊ."

"నీ జీవితం ఇప్పుడు సంతోషంగా వుందా?"

"ఉన్నంత వుంది. నీకు వుందా?"

"ఊ."

"అయితే, నాకూ ఉంది."

"వాదించకు. నిన్ను చూస్తే ఏదో ఓ గాడిలో పడి, ఇంతే మన బతుకు అని ఆగిపోయిన వాడికి మల్లే కనడపతున్నావు."

"నువ్వూ-అంతేకాదు. మనుషులందరూ అట్లానే కనపడతారు."

"మాకు వీళ్లు లేక, ఓ లక్ష రూపాయలుంటే, నేనే జడ్జినైతే, ఇంత సంతోషంగా వుంటాను అని తెలును నాకు. కాని, వీలుకావు అవి. అంద ఆగిపోయినాను. ఇంక నా పిల్లలు పురోభివృద్ధిలో బతుకుతో ముందు చూస్తు కలాంటివి ఏంలేవు. ఆశలేదు. ఎదగడం ఆగిపోయినావు పాపం!"

అతను నిజమే నన్నట్టు ఆలోచిస్తున్నాడు.

"పోనీ, దేనికోసం నువ్వింత విప్లవం తెచ్చుకున్నావో, ఆ సంతోషమన్నా మిగి నీకు?"

అతను మాట్లాడలేదు.

"నిజం చెప్పు నాతో. దాపరిక మెందుకూ? ఆ వ్యామోహం ఎన్నాళ్ళుంది

"నాలుగైదేళ్లు."

"ఆ నాలుగేళ్ల తరువాత ఈ పదిహేనేళ్లు ఏంలేదు. ఆగిపోయినావు. ఏ వివేకం వుందా. నువ్వు చేసిన పనిలో? తాత్కాలిక వ్యామోహంలో జీవితాన్ని ధ్వ చేసుకున్నావు."

అతను మెల్లిగా ఆగి మాట్లాడుతున్నాడు.

"ఒప్పుకోను."

"ఒప్పుకోక? ఉత్త పెంకితనం. ఇంకా నిజం ఒప్పుకోడం నామోషీ నీకు!

బాగా పెడుతున్నాను అతని మొహాన,

"నేను చెప్పే మాటలు, నీకు తెలిసినంత వరకు నీతో వాస్తవం చెబుతు నువ్వు ఒప్పుకోక పోతే, మనం మాట్లాడుకుని ప్రయోజనం లేదు. నాలుగైదేళ్ళ మనుభవించానో నువ్వు తెలుసుకుంటే అటు తరవాత వందేళ్ళు సమస్త కష్ట అనుభవిస్తేనేం అనిపిస్తుంది. నీకైనా సరే."

"అయిపోయినాయి కద?"

"నా అయిదేళ్ళూ అయిపోయినాయి. ఓనాడు నీ వంద ఏళ్లూ అయి పోత ఏమి వాస్తవమైనదీ, లోతైనదీ అనుభవించకుండానే రూపాయల్నీ, పిల్లల్నీ చూసుకుంటో నీ ఆయువు నిండుతుంది. గొప్ప కష్టదినాలూ అయిపోతాయి. అ ఈనాడైనా ఆ జ్ఞాపకం చాలు, నన్ను గొప్ప గర్వంతో మానవశ్రేష్టుణ్ణి అనిపిం చేసేందుకు. కాని, క్రమంగా కాలం మరుపుని కప్పుతుంది. ఎంత గొప్ప అను మీదనైనా సరే."

"అదేమిటో ఆ అదృష్టం నాకు కొంచెం చెబుదూ?"

"ఎట్లా చెప్పను? ఏం చెప్పను? ఎలా నీకు అర్థమౌతుంది? పోనీ, నే సంగతులు నిజం చెబుతావా?"



"తప్పకుండా."

"నీ భార్యకాక, వేరే స్త్రీల నెరుగుదువా?"

"ఊ."

"ఎట్లా?"

"డబ్బుతో."

"నిన్ను ప్రేమించి, తానెరిగిన మనుషుల్లో నువ్వేకావాలని ఏరి నిన్నే ఏ స్త్రీ అయినా కోరిందా?"

"లేదు."

"నీ భార్యగాని, ఇంకో స్త్రీ గాని, నిన్ను విడవలేక, తన చేతుల్లో ఖైదు చేసుకుందా? ఒక్క నిమిషం కనుమరుగైతే నీ కోసం తహతహ లాడిందా? నీ కళ్ళలోకి చూస్తో, బంధువుల్నీ, ఐశ్వర్యాన్నీ, లోకాన్నీ, తననే మరిచి తల్లిమల్లే నిన్ను రొమ్ము మీదకి తీసుకొని, నవ్వి, ఓదార్చి, దిగుళ్ళని తన చూపు ే, కన్నీళ్ళతో లాలించిందా?"

"అన్నీ కవిత్వాలు."

"సరేలే. నేను చెప్పినవి ముందు చాలా అల్పమనుకో. పోనీ, ఎప్పుడయినా నువ్వు ఏ సౌందర్యాన్నన్నా చూసి అది కావాలనీ, దానికోసం సర్వమూ త్యజించగలననీ, రాత్రింబవళ్ళు ఆ కోర్కెతో వుండిపోయినావా?"

"లేదు."

"ఇంక నా మాటలు నీకే మర్థమవుతాయి. నేనేమన్నా చెపితే! తక్కిన జీవితం పోనీ. కొత్త యవ్వనంలోనైనా, ఏ లోకంలో వున్నామో మరిచిపోయి, ఇంతకన్న స్వర్గం ఏముందని ప్రతిగంటా ప్రియురాలి నేత్రాల్లో కొత్త సూర్యోదయమయినట్టు వెలగకపోతే, ఆ జీవితానికి అర్థం ఏముంటుంది? ఎంత గొప్పకానీ, ఎంత ఐశ్వర్యం రానీ తరవాత! కొమ్మల మీది పక్షులవలె అవసరంలేని పలుకులు, ఆగని నవ్వులు, ఎడతెరిపిలేని ముద్దులు, నడకలో, మాటలో,చూపులో పొంగి వచ్చే ఉత్సాహాలు ఆ కాలం వొక్కటే కద! ఈ లోకంలోకి స్వర్గాన్ని లాక్కొచ్చేది? ఒకప్పుడన్నా అనుభవాన్ని యెరగని మనిషితో నేనేం మాట్లాడను?"

ఆగాడు జ్ఞాపకం తెచ్చుకుంటో.

"ఏ మాట. మామూలు మాట. దాంటో లేని అర్థాన్ని నీ చెవులకి పక్కనించి నీ వొంక ఒక్కచూపు. నీ నరాల్లో గొప్ప విద్యుల్లతలు. రాత్రవుతోంది; పువ్వుల్లో, నక్షత్రాలలో పూగుతో, అలసి నిద్రపోతూ కూడా నీ పక్కనుండి, నీ రొమ్ము చుట్టూ చేతిని తియ్యలేని అనురాగం. తెల్లారిందంటే, తానూ నువ్వూ పసితనంలో మల్లే ప్రతి స్వల్ప స్థితిలో, గాలిలో వూగే గడ్డిపరక చివరి వానబొట్టులో, సోమరిగా తేలిపోయే, తెల్లని మబ్బు

మెరుగులో, తూలుతో యెగిరే శతాకోక చిలకలో, ఇది వరకు చూడనిఅంద
ఆనందా లప్రయోజనాలు; ఓ పూలదండ, పక్కమీది ఓ దిండు, చేతి గాజు కో
తగూలు, నవ్వులు, పెనగులాడటం, రోడ్డుమీది ఓ మొహం, కుక్క కక్కుర్తి, పిచిక
సంయోగం, ఈగ కాళ్ళ దులుపు, అన్నీ నవ్వులాటలే, హాస్యాలే. నిత్యమూ శరీరాలు
ఒకరికిఒకోరు కొత్త. ఇది వరకు ఎరగని మనోభావాల కొత్త వికాసం తెలీడం, ఆశ్చర్య
ముద్దు, ఒక బట్ట కొంచెం ఒత్తిగిలితే కొత్త డిస్కవరీలాగు - యీ ప్రపంచం పై
మాయతెర ఒత్తిగిలినంత సంతోషం. చూడడం, తాకడం, సిగ్గు, బలవంతం, మొద
రాత్రి థ్రిల్, ప్రియురాలి భుజంమీద ఆనుకుని చంద్రుడివంక చూస్తో, వెన్నెల ఆ
చంపమీద నించి జారి చీరె చెరగుకింద కన్పించే సగం నీడల్ని చూస్తో రాత్రి రాత్రం
గడిపావా? ఇట్లాంటివి వున్నాయని ఒప్పుకోరు. వొప్పుకుంటే అట్లా బతకలే
అనుభవించిన వాళ్ళు ఎన్నడూ చెప్పలేరు. నేను చెప్పానా? చెపితే నమ్మరు. ను
నమ్ముతున్నావా?"

ఆగాడు.

"ఇప్పుడూ?" అని అడిగాను వూపిరి ఆగి.

"కాని, ఎంత గొప్ప అనుభవమూ పాత బడుతుంది. మామూలౌ తుం
రాధ అందం వంటి అందం కూడా కళ్లని కట్టెయ్యడం ఆగిపోతుంది ప్రత్యేక
సమయాలలో తప్ప. కాని తరవాత........."

ఆగాడు.

"రెండు మూడుసార్లు రాధని వొదిలి వెళ్ళిపోయాను తెలుసా?"

"ఎందుకూ?"

"కొంత కాలానికి, గంటలు బరువుగా వేళ్లాడ్డం ప్రారంభించాయి. ఏ ఆ
లేకండా నిర్జీవంగా అవుతున్నా ననిపించింది. అట్లాంటప్పుడే మొగవాడికి ఓ ఉద్యోగ
ఉండాలి. స్త్రీ నిలవగలదు ఆ కలల్లోనే. గడిచినవి కానీ, వొస్తాయనుకునేవి కా
వాటిల్లో. అందుకనే భరించలేక, ఆ తోచని తనం రాధ తప్పే ననుకుని, నే
వొదులుకున్న వాటి భూతాలు నన్ను తరిమి ఏడిపిస్తే, పోయినాను."

"పోం ?"

"తిరిగాను. ఉద్యోగమూ సంపాయించాను. మళ్ళీ భార్య దగ్గిరికి పోవాల
యోచించాను. రాధ జ్ఞాపకాల్ని రాత్రులు తుడిచి వెయ్యాలని, ఇతర స్త్రీలను డబ్బు
కొనుక్కున్నాను. ఒక ప్రేమ వ్యవహారాన్ని అనుభవించాను."

"మరి?"



"కాని ఒకసారి గొప్పగా, తృప్తిగా అనుభవించిన శరీరం,మరి జ్ఞాపకమను-అలవాటను, అందులో రాదవంటి స్త్రీతో, దాని తరవాత ఇంకేమీ చెయ్యలేం. ఆమె నీతో లేనిది, ఉందని గుర్తులేంది, ఏ ఉద్యోగమూ చెయ్యలేవు. మళ్ళీ మళ్ళీ తిరిగి వొచ్చాను. రాధ కిందికి వంగి పని చేసుకునేటప్పుడు ఆమె బుజాలమీద పడే జుట్టులోంచి మెరిసే బుజాలు, రాత్రులు చీకట్లో మెరిసే ఆమె తొడలూ, అల్లాంటి అందాన్ని - అందమే కాదు ఒక్కొక్క వొంట్లో ఓ మృదుత్వం, నీ రక్తాన్ని నీలోంచి, తన చేతుల్లోంచి, రొమ్ముల్లోంచి, తనలోకి లాక్కునే గొప్ప ఆకర్షణ-కవిత్వం కాదు వొంటికే తెలుస్తుంది అది. అటు తరవాత యేమీ చెయ్యలేవనుకో. శృంగారం, అట్లాంటి ఆకర్షణ అంత అపురూపం కాబట్టే ప్రపంచంలో మనుషులు యుద్ధాలు,యత్నాలు, విప్లవాలు, మంత్రిత్వాలు చెయ్యగలుగుతున్నారు గాని-పాసిస్టులకీ, కమ్యూనిస్టులకీ, గాంధీ గారికి, బ్రహ్మ సమాజం వారికీ- యీ దీక్షా పరులందరికీ శృంగారం యెంత విరోధమో గమనించావా? ప్రేమ - అనే నీరసపదం వాడతారుగాని, అదేదో తల్లీ పిల్లా అట్లాంటి వాటిల్లో కనపడవలసిందే! పక్కమీదకలియని ప్రేమ ఉత్తనాన్ సెన్సు. చివరికి పిల్లని కావిలించుకుని ముద్దు పెట్టుకోని తల్లి ప్రేమని ఆలోచించు. ఎవరూ నేర్పకండానే పిల్లతల్లి మెడ చుట్టూ చేతులు వేస్తుంది కద!" అని ఆగాడు.

"అదంతా సరేలే, కొత్త జీవితం ప్రారంభించి చూడకూడదూ?"

"అదేగా నేను చెప్పేదీ! ప్రయత్నించి చూశాను. తిరిగి వొచ్చాను. నాకేమనిపించిందంటే, వోసారి గొప్ప శృంగారాన్ని అనుభవించినవాడు, యావజ్జీవం దానికే అంకితమై పోతాడనే నా అనుభవం మాయం కాలేదు. నా లోపలి రక్తంలోకి, ఎముకల్లోకి ఇంకి నన్ను మార్చేసింది. నాకు తెలియకుండానే. అది మా మధ్య జీవితంలో మమ్మల్ని గొప్ప బంధంతో కట్టేసింది."

"నువ్వు తిరిగి వొచ్చిందాకా రాధ ఏం చేస్తోంది? ఏమీ అనలేదా?"

"అట్లాంటి సంగతి ఒక్క పతివ్రతల్లోనే వుంటుంది ఏనాడైనా సరే. ఆమెకి నేను ఆర్థికంగా మర్యాదకి కూడా అవసరంలేదు. డబ్బంతా ఆమె పేర వుంది. నా స్థితి చూసి రెండుసార్లు ఆ డబ్బు పంపించేసింది."

ఇంక మాట్లాడ్డానికి నాకేం తోచలేదు. మర్నాడు ఆ వూరు వొదులు తున్నాను. వెళ్ళేప్పుడు మాత్రం, ఆ రాత్రి పాదల కింది లాంతరు స్తంభం దగ్గిర అతను-

"నువ్వు వెడుతున్నావు. కొన్నాళ్ళదాకా మళ్ళీ ఏం తోచదు. ఎప్పుడన్నా వొస్తో వుండు!" అన్నాడు.

"పోనీ, నువ్వే వొస్తూండకూడదూ."

"పోనిద్దూ, ఆ పాత మొహాలన్నీ.... నా మాటలు నీకేమైనా అర్థమైనాయా?"

"ఊ."

"ఏం అర్థం కాలే, పెదవుల మీద చిరునవ్వు ఒంపులో లక్ష వెన్నెలల వృ తేజస్సుల్ని చూడడం చాతనైతేగాని-"

అంటో వెళ్ళిపోయినాడు.

"నేను ఒచ్చేశాను" అన్నాడు రాజారావు.

చాలా నిశ్శబ్దంగా విన్నారు. ఆ మధ్యలో ఎప్పుడు ఆగిందో ఆగింది వా

"ఇంతకీ ఇదంతా బోగం మేళాలు పెట్టడంవల్ల సంభవించిన అనర్థమంటా రాజారావ్?" అన్నాడు కంట్రాక్టరు వీరయ్య.

"అనర్థమో అర్థమో-అట్లాంటివి జరుగుతాయి మరి, వేశ్యల్ని ఇళ్ళకి రా నాట్యమాడించుకుంటే."

అందరూ లేచారు ఇళ్ళకి పోవడానికి. ఇంతలో సూరి శాస్త్రుల్ల వారు ఒచ్చా ఆయన గొప్ప డాక్టరు పెద్దవాడు. ఆ పెళ్ళిలో కూడా ఓ పెద్ద. ఆయన కొడు డాక్టరే. సూరి శాస్త్రుల్లవారు మా హోస్టు. రామయ్యగారితో ఏదో గబగబ మాట్లాడా

"క్షమించండి. ఉండండి. ఇప్పుడే ఒస్తాను" అని లోపలికి వెళ్లా రామయ్యగారు సూరిశాస్త్రుల్ల వారితో సహా.

ఎంతకీ ఎవరూ రారు. అతితులకి వెళ్ళాలో ఉండాలో తెలీదు. కొంద చల్లగా జారుకుంటున్నారు. లోపల కొంచెం హడావిడిగా వుంది.

"ఏదో పోయిందేమో, ఏ నగలో! అబ్బా ఈ పెళ్ళిళ్ళు! చూసి ఒస్తా వుండండి" అని పెళ్ళికొడుకు మేనమామ వెళ్ళాడు లోపలికి.

అయిదు నిమిషాల్లో తొరతొరగా ఒచ్చాడు-

"పెళ్ళి కొడుకు భోజనం తరవాత లేడు. కనపళ్లేదు. సూరి శాస్త్రుల్లు గా కోడలూ లేదు. వాళ్ళ పెళ్లి వూరేగింపు కారూ కనపడదు" అని నవ్వుతున్నాడు.

* * *

# నా మొదటి క్రాఫ్

స్కూలు ఫైనలు పాసైన వాడికీ కానివాడికీ భేదం వుంటుం దంటారా? వుండదంటారా? బ్రాహ్మడికీ పంచముడికీ వున్నంత భేద ముండక పోవచ్చును గాని, అసలు వుండదంటారా లేదా? కలెక్టరు దగ్గరికీ గుమాస్తా పని యివ్వమని రాసుకొని, స్కూలు ఫైనలు కానివాడూ వెళ్ళాడు; నేనూ వెళ్ళాననుకోండి. వాణ్ణి చూడగానే "పాసైనావా" అని అడుగుతాడు. కాని వాడేమీ మాట్లాడకముందే కనిపెడతాడు దొర. వాడి గ్రహచారం. కనిపెట్ట డంతోనే గజ్జికుక్కని తరిమినట్లు తరుముతాడు బయటికి. అంతేనా? నన్నో! నన్ను చూడగానే నా సర్టిఫికెట్లు పుస్తకంపైన వేసిన అట్టకాయితం విప్పకముందే కుర్చీ చూపించి తన కొడుకు నాదరించినట్లు ఆదరిస్తాడు. అంతేగదా! ఈ కాస్త సంగతీ మా నాన్నకి తెలీదు. తెలియజేస్తే తెలుసుకోడు. నేను పాసుకాక ముందు, సరే, విస్తట్లో రెట్ట వేసిన కోడిని చూసినట్లు చూసేవాడు నన్ను. నేనేమన్నాను? న్యాయమేనని వూరుకున్నాను. కాని పాసయిం తరవాత కూడా అంత లఘు దృష్టినే ప్రసరిస్తాడు నామీద. అదేమిటి చెప్పండి! మళ్ళీ తాను నాలుగుసార్లు లోపర్ సెకండరీపైన దండెత్తి ఓడి, గాయాలై విసికెత్తి, తిట్టుకుని, పరిగెత్తి కోమటి వీరయ్య దగ్గిర గుమాస్తాగా శరణు జొచ్చాడు. జోసెఫ్ నన్ను కంగ్రాచ్యులేట్‌చేస్తో వుండగా, నే చదవకండానే, రాయకండానే అద్భుతంగా, నా అదృష్టరేఖ వల్ల యెట్లా పాసైనానో వర్ణిస్తూ ఉండగా మా నాన్న ఒచ్చి "ఏమిరా వెధవా! పాటిమీదికి పెరుక్కు పోలేదింకా! కంచం ముందు కూచుని దాచపెట్టినట్లు "పెరుగు" అని అరు, చెపుతా" నన్నాడు, నేను స్కూలు - ఫై-న-ల్ పాసైన వుదయం.

అసలు మా యిద్దరికీ ఆ వుదయం పోట్లాటెందుకు పడ్డదంటే, నా మొక్కు విషయమై. నేను పరీక్ష పాసైతే మా వూరి ఆంజనేయస్వామికి నా జుట్టు యిస్తానని దృఢంగా మొక్కుకున్నాను. ఒంటినిండా బొచ్చున్న ఆ స్వామికి నా జుట్టుతో ఏమి పని అనుకొన్నాను గాని, ఆలోచించగా ఆ తిరపతి వెంకటేశ్వరస్వామికి అన్ని జుట్లమీద ప్రేమ ఉండగా లేనిది, ఆ స్వామి ప్రియభక్తుడు, యీ కోతి స్వామికి మాత్రం నా ఒక్క జుట్టు మీదైనా యిష్టముండకూడదా అని సమాధానం తోచింది. ఒకసారి యామయింది! సీతాపతి భార్య తిరపతిలో జుట్టు మరిచిపోయిఒస్తే, వెధవముండల పెళ్ళిళ్ళ ట్రావిలింగ్ ఏజంటు మావూరు ఒచ్చి, ఆమెను వితంతువనుకుని, రాజమంద్రి యెత్తుకుపోయినాడు. మొగుడు వెళ్ళి మొత్తుకుంటే, ఆ జుట్టు త్వరగా పెంచి, అతనికే

ఆమెనే విధవా వివాహం చేసి, అది రెండువందలా ఆరో వివాహమని పే
వైభవంగా వేయించి, పంపారు.

పోనీ ఆ వెంకటేశ్వరస్వామికి, చిన్నపిల్లల మొదటి చిన్న వెంట్రుకల
చక్కని నల్లని పొడుగాటి కుంతలాలమీదో కన్ను పడ్డదంటే అర్థముంది. కా
దేముడికీ అర్పణము కాకండానే మెడమీద గొరిగి నట్టున్న తూము తలలు,
కాలు జారిపోయి బోర్లాపడే అద్దం బట్ట తలలూ, యింక వితంతు తలల
భేదం చూపడం కోసమే నాలుగు పీచుల్ని ముడేసి పెట్టె దరిద్ర తలలూ - ఇ
గొరిగించుకుని, జబ్బులు నయం చేస్తాడే, పరీక్షలు పాసు చేస్తాడే ఆయన కేం లా
గుప్పెడు జుట్టురాని లాభం మాట అట్లా వుంచి, అదేం 'టేస్టు!'

నా ఫౌన్టెన్ పెన్నుండగా, నా బొమ్మల ఆల్బముండగా, శివాయితో రె
గంటలు జాంబవంత సంగ్రామం చేసి నేను గెలుచుకున్న విరిగిన చాకు వుం
నా జుట్టు మాత్రం యేం మహాగొప్ప అని, దీన్ని మొక్కు కున్నానంటే, దీనికి
వుంది. గడిచిన ఐదు ఏళ్ళనించీ పూజనీయులైన మా నాన్నగారికీ, నాకూ నా జు
వుండవలసిన కొలతను గురించి ఘోర సంగ్రామం జరుగుతూ వు
పదహారంగుళాలు పొడుగున గుర్రానికి లాగు వెనక వేళ్లాడుతో కనపడితేనేగాని
పుణ్యవంశపు పునాది రుషులకీ, పితృ దేవతలకీ చాలా కోపం ఒచ్చి, బతికున్న
ముసలి అత్తకీ, నాకూ, మా నాన్నకీ, కచేరీ బేరీదొరకీ అద్భుతమైన కీడు కలగజేస్తా
మా నాయన అభిప్రాయం. పాతికంగుళం మొదలు రెండంగుళాల వరకు క్రమ
హెచ్చుతో తగ్గుతో విలసిల్లితేనే గాని నవ నాగరికతా యోగి పుంగవులకూ, విద్యా
పితృదేవతలకూ, మా వూళ్ళో నాటకాల పిచ్చెయ్యకూ శాంతిలేక, తృణీ
దృష్టులతోనూ, పెదవి విరుపుళ్ళతోనూ నన్ను నీచస్తానానికి పడతోస్తారని నా భయ
తనకూ ఇతరులకూ అభిప్రాయ భేదం కలిగినప్పుడు తన అభిప్రాయాలకి కించి
లోపముగాని, ఇతరుల అభిప్రాయాలలో యీషన్మాత్రం ఆధిక్యంగాని వున్న
ఒప్పుకోని ప్రజా చక్రవర్తి మా తండ్రి. చిన్నప్పటి నించి కూడా ఆయన్ని చూడగా
విద్యుచ్ఛక్తి సంబంధమైన కొన్ని చలనాలు నా దేహంలో కలగడం నాకు మామూ
ఒకసారి ఆయనకి జబ్బుచేసి నా దేహశుద్ధి తంతుకి సహితం లేచే శక్తి లేనప్పు
'నాయినా యింద' అని నన్ను దగ్గిరికి పిలిచి చప్పున జుట్టు పట్టుకొని, మంచంకో
కేసి నా తల బాదడం, నాకు రాత్రులు కలలుగా రావడం యీ నాటికీ మానలే
ఆరు జెర్రుల్నీ, మూడు పాముల్నీ, రెండు బొమ్మ జెముడు పొదల్నీ, నాలుగు పోట్లావృ
పదిమంది టీచర్లనీ భరించగలనుగాని, మా తండ్రి చూపు ఒక్క నిముషం నివాసం
నా ముఖం మీద సహించలేను. ఆయన మొహం మహాత్యమో, నా బుద్ధి వక్రత్వమో
గాని, ఆయన నా వంక కన్నెత్తి రోకలి బండ పురుగుని చూపినట్ల చూశాడా, యెనిమి
హెన్రీ ఏడుగురు పెళ్లాల్ని చంపడమూ, అల్లావుద్దీన్ జలాలుద్దీన్ని చంపడమ



పురుకుత్సుడో యెవడో చేసిన బ్రహ్మ హత్యా, అన్నీ నేనే చేశాననుకొని భయపడి, కుక్కపిల్ల మల్లే వీపుమీద పడుకొని, కాళ్ళు పైకెత్తి నాలిక జాచి నమస్కారంచేసి, డొక్కలో తన్నుకి సిద్ధపడతాను. అంత భయమే లేకపోతే, ఆయన మీద నాకున్న ద్వేషానికి, ఆయన్ని యెన్ని బాధలు పెట్టి ఎన్ని మారణహోమాలు చేసి వుందునో! 'ముసిలివాడై నాక తెలుస్తుంది!' అనుకుంటాగాని అప్పుడు మాత్రం లాభంలేదు. ఈ గుండెల గడబిడ ఆగితేకద! చస్తే మాత్రం- ఆయనే లేచి పలికి, 'నా పీనుగను కాలుస్తావా, నిన్ను....నిన్ను పాతెయ్యనా' అంటే నేను ఆయనకు నిప్పు అంటించగలనా! 'ఏమిట్రా ఆ పని!' అన్నాడంటే చావమా! ఒకటే ఆశ. బ్రహ్మ సమాజం వాళ్ళతో కలిసి తద్దినాలు మానెయ్యాలని! అప్పటికీ భయమే. నాకు దెయ్యాల్లో నమ్మకముంది. ఈ కాలయముడు దయ్యమైతే లోకాలు నిలుస్తాయా! నిద్రపోయేప్పుడు గుండెల మీదెక్కి "యేమిట్రా, తద్దినం పెట్టవూ? నీ తద్దినం పెడతా, ఈ రాత్రి." అని బొమికలు కటకటా చప్పుడు చేశాడంటే-

కాని యెంత పురుగునైనా, నన్ను అన్యాయంగా, కాలుకింద నలగ తొక్కుతోవుంటే, కొంచెం చోటు చేసుకొని తలెత్తి పాదంకింద నిలిచి నా అభిప్రాయం తెలియచేయకుండా వుండగలనా! ఆయన చండశాసనానుసారం శివుడు కంఠాన కాలకూటాన్ని భరించినట్టు నాలుగేళ్ళు నా ప్రజల విరోధిని ఆ తలమీద ప్రతిక్షణం ధరించి, దీనికి నూనెలు రాసి, చిక్కుతీసి, పోషించాను. ఇంకెన్నాళ్ళు! స్కూలు ఫైనలుతో మా హిస్టరీ మాష్టరు, తప్పిన లక్ష్మీనారాయణ వెధవ, ఆ మిత్రభేదాల హెడ్మాష్టరు మీసాలు, అన్నీఒదిలి పోయినాయి కాని, యీ జుట్టు భారాన్ని మాత్రం వెంటబెట్టుకొని బయటికి రానా? యింకా-

ఆవాళ తొమ్మిది గంటల పది నిమిషాలకి మా నాన్న దృష్టిని నా ముఖంతో వికసింపచేసి 'నాకో నాలుగణాలు కావా'లన్నాను.

"నాలుగణాలే నాలుగు రూపాయిలేం కాదూ." అని సంభాషణ ముగించి, కర్టన్ దింపాలని చూశాడు. ఒకసారి మేము స్కూలులో నాటకం వేశాం స్టేజీమీద. నాకూ ఒక కుర్రాడికీ సంభాషణ ఏర్పాటు చేశారు. అదంతా ఒకటిన్నర నిమిషం పడుతుంది. అంతే నా పార్టు. నా అంత తెలివిగలవాడికి అంత కొంచెం ప్రాముఖ్యత యిచ్చినందుకు చాలా అవమానపడి, వాడూ నేనూ కలిసి తమాషా చేశాం. మా ఒకటిన్నర నిమిషం సంభాషణ కాగానే, మేము గుడ్‌బై చెప్పకోక, మా సరదా తీరేటట్టు, నోటి కొచ్చినట్టూ, తోచినట్టూ, కులాసగా, తీరుబడిగా సంభాషణ ప్రారంభించాం. లోపలనించి మమ్మల్ని రమ్మనేకేకలు మేము విదలచుకోలేదు. చివరికి ఒకగంట అట్టా మాట్టాడి లోపలికి పెడితేతంతారు గనక, గుడ్‌బై చెప్పేసి, స్టేజిమీద నించి అమాంతంగా ముందున్న ప్రేక్షకులవేపు దూకి యింటికి కొట్టెయ్యాలని మా యెత్తు.

"మన వూళ్ళోకల్లా వెధవ యెవఁడ్రా బ్రదర్?" అన్నాడు వాడు ఒక కాలు పైకెత్తి. నేను చెయ్యి ముందుకు జాచి, నాలిక బైటపెట్టి నవ్వి,. "మా నాన్న" అనబోతున్నాను. చప్పున కర్టను పడ్డది. చూశారా ఆ లేకి తనం! మమ్మల్ని స్టేజి పోయిందో లేదో అడక్కుండా, గుడ్‌బై షోకుగా కాళ్ళ సందునించి పెట్టుకోనీకుండా, చప్పున కర్టన్ వెయ్యడం?

"నాకు నాలుగణాలు కావాలి" అని కడుపు నొప్పిలాగు పట్టుకొన్నాను, నాన్నని. నా మీద విసరి చేయడానికి ఆయనకీ అందుబాటులో యేమీ లేని సంగతి చూశాను ముందే-రొంటిన డబ్బులూ, పొడుంకాయా తప్ప. డబ్బులన్నావేసి నా మొహానికి దెబ్బతగిలిస్తాడు గాని, పొడుంకాయా వెయ్యడు కదా?

"నాలుగణాలు, నాన్నా!"

"యెందుకురా?"

పదహారేళ్ళ క్రితం తను ఒక పాడుపని చేశాననీ, దాని పలితమే నాలుగణాల కోసం అరుస్తోందనీ గుర్తించినట్టున్నాడు మా నాన్న.

"నేను స్కూలు ఫైనలు పాసయితే ఆంజనేయస్వామికి మొక్కు చెల్లిస్తానన్నాను...." అది మరీ అంత పాడుపని కాదనీ, యీ శతాబ్దంలో కూడా స్వామికి మొక్కుకునే కొడుకుని, పదేళ్ళ మాల చదువు కూడా పాడుచెయ్యలేని కొడుకుని కన్న తన ప్రసిద్ధికి గర్వం సూచించినాయి ఆయన కళ్ళు.

"కాని, ఆ మిగిలిన కొబ్బరిచిప్ప యింటికి పట్రా" అంటూ నాలు గణాలు నా వేపు పారేశాడు. డబ్బులు ముందు గుప్పెళ్ళో జాగ్రత్తచేసి-

"కొబ్బరికాయలు కాదూ"

"కాదూ? కోడిగుడ్లా?"

"కాదు, నా జుట్టు"

"జుట్టా?"

ఇటువంటి ఆపత్సమయాల్లో కూడా ధైర్యాన్ని విడవనటువంటి గుండె మానాన్నది. కాని యిటువంటి దౌర్భాగ్యుణ్ణి కన్నందుకు మా అమ్మ మీద, అంతమాత్రం కారణమూ లేకుండానే మా మామ మీదా మండి పడ్డాయి ఆయన కళ్లు. కానీ ఏ ఆవత్తులోనూ, రైలు బండిచక్రాల కిందా, హెడ్మాష్టరు వురుము చూపులకిందా కూడా జడుసుకొని వంశాబ్ది సోముణ్ణి అయిన నేను మాత్రం జంకుతానా! అట్లాంటి సందిగ్ధాలలో, నాటకంలోవలె, అన్నమాటే మళ్ళీ అంటే వుపకరిస్తుందని.

"అవును! నా జుట్టు" అన్నాను.



"నీ మొహం," అని దిద్దాడు మా నాన్న.

అప్రమత్తంగా, యీ కుటుంబ కలహాల్లోకి నా మొహాన్ని దించడం చాలా అన్యాయంగా తోచింది నాకు. కాని నా మొహం గొరిగించవలసిన అవసరం మా నాన్నవలె నాకు పట్టలేదు యింకా. ఆ మాట అనడం గౌరవమైన కుటుంబంలో పుట్టి, సరియైన శిక్షణలో పెరిగి, స్కూలు ఫైనలు రిజిష్టరులో, "కాన్డక్టు వెరీగుడ్" అని రాయించుకొన్నవాడి లక్షణం కాదని వూరుకున్నాను.

"నా ముహం కాదు. జట్టు" అని మా నాన్న వాక్యాన్ని నేను సవరణ చేయడంతో వూరుకున్నాడు.

"నీ తలకాయి! అపతలికి నడు".

"అవును, అదే!"

"ఏమిట్రా? గొరిగిస్తావూ." అని మండిపడ్డాడు. "కత్తిరిస్తాను" అంటే కొంత జుట్టున్నా నిలుస్తుంది కదా అని కోపం సగం తగ్గిస్తాడనుకోవడం న్యాయమా, అన్యాయమా! పోనీ "మాథమిటిక్సు" ప్రకారం ఆలోచించండి. కాని మూడురెట్లు కళ్ళు మండిపడ్డాయి, మా నాన్నవి.

"తలంతానా?"

"జుట్టు మాత్రం"

"అదేనోయ్, మాల వెధవ్వవుతావన్నమాట"

ఆ లాజిక్ నాకు అర్థం కాలేదు.

"మామయ్యమల్లే" అన్నాను.

"మీ మామయ్య ఒక అప్రాచక వెధవ; మీ అమ్మ ఒక అంట్లముండ; వాళ్ళకు పుట్టినవాడివి స్నువ్వో దరిద్రపు కుంకవి."

ఆ కోపంలో నే నెవరికి పుట్టానో నాన్న మరిచిపోయినాడు. అక్కయ్య యెవరికి పుట్టిందంటారో విందామని ఆగాను కాని, లాభం లేక పోయింది.

"నువ్వు జుట్టు కత్తిరించు. చెపుతా, మొక్కుట. మొక్కు ! ఆంజనేయులుట, పీంజనేయులు!"

తన పేరిట్లా హటాత్తుగా మార్చాడంటే, అన్ని పేర్లుగల ఆంజనేయులైనా సంతోషించేవాడో లేదో కాని, మా ఆంజనేయులు మాష్టరు గారు మాత్రం, పీంజనేయులు మాష్టరని పిలిపించుకోవడాని కిష్టపడరని తెలుసు నాకు.

"వెధవ వేషాలు వెయ్యకు, పోయి కొత్త క్లాసు పాఠాలు చదవడం మొదలుపెట్టు" అని లేచి యింక నేను మాట్లాడ్డానికి వీలులేకుండా దొడ్లోకి పోయి

కూచున్నాడు. నేనింకా యెన్నో చెపుదామనీ, నేను గొరిగించుకో కుండా యెందుక కత్తిరించుకుంటున్నానో కారణం వివరిద్దామనీ అనుకున్నాను. పోనీ మీతోనన్నా వెళ్ళబుచ్చుకుంటా నా తెలివి. చూడండి. మీకు ప్రాక్షణులు వచ్చుకదా! అన్ని సబ్జక్టుల్లో వంద మార్కులు వస్తే అంత జుట్టూ మొక్కాను. కాని, ఇంగ్లీషులో నలభై, లెక్కల్లో యెనభై, తెలుగులో నలభై యేడువొచ్చాయి. అట్లానే ముందుజట్టు నూటికి నల పొట్టి, నూటికి యెనభై పొట్టి వెనక, పక్కల తెలుగూ సయిన్సూ, ఏ మాత్రం తెలివిగల వాడైనా యీ "రీజనింగ్" ఒప్పుకుంటాడా లేదా ఒక్క మా నాన్న తప్ప!

కాలేజీలో యింటరు క్లాసులో కూచ్చుంటే నా పెద్ద జుట్టు ముడిని చూసి నన్ను నా ముడినీ, కాలేజీ మ్యూజియంలో బిగిస్తారని మా నాన్నకి యెట్లా తెలియజేయడం! వేదకాలంలో అందరికి క్రాఫింగు లేననీ, క్రాఫింగు పెట్టని వారికి నూరు గోవుల జుల్మానా అని మనువు శృతుల్లో రాశారనీ. క్రాఫింగులేని పుత్రులెం మంది తండ్రికి వున్నా నరకం తప్పదనీ' క్రాఫింగు చేయించుకుంటాననే సదుద్దేశా వ్యక్తం చేసిన పుత్రుడి నిశ్చయానికి అడ్డం తగిలే తండ్రి అధోలాకానికి పోతాడనీ శంకర రామానుజ, మధ్వాచార్యులు వేదవ్యాసుణ్ణి అద్యక్షుణ్ణిగా పెట్టుకుని శ్లోకాల కోట్ చేసుకుంటూ వొచ్చి రూఢి చేసినా, తనమాట నిజమని వాదించే మ్లేచ్ఛ ప్ర సంఘానికి నిత్యజీవనాధక్ష్యక్షుడు మా నాన్న.

తలొంచుకొని సరాసరి సెలూన్‌కు వెళ్ళాను, కొట్టంలోవున్న దూడని చేరబోయే ఆవులాగు. ఆ 'సెలూన్' అధిష్టానమహాదైవం మంగలి మాధవుడు; తన పూర్వు పద్ధతుల ననుసరించి, తన పంగనామాల వెడల్పు ఒక వాసి తగ్గించక యెంత బలీయమైన ప్రజాభిప్రాయాన్నీ ధిక్కరించిన వాళ్ళలో ప్రథముడైన మాధవుడు ఇంటింట తిరిగి గొరిగే తన పెద్దల మార్గాన్ని విడిచి, అతను యిట్లా 'సెలూన్' తెరవడానికి కారణం లేకపోలేదు. యీ సెలూన్ తెరిచి, తన పితృదేవతల్ని ఒక్కసారిగా, రంభాశీతల బాహువులనుంచి, కాగే వేడి నూనెలోకి జారేటట్టు చేసిన కారణానికి కొంత వరకు తండ్రి బాధ్యుడు అంటారు. మాధవుడు జన్మ కుంటి.

మంగలైనాడు గాని మాధవుడి ముఖాన రాజతీవి వుంది. అతను ఆ దారిన ఇంటినించి వచ్చే సమయానికి తప్పకుండా గుమ్మాల్లో తత్సారం చేసే ముగ్గురు నిష్కలంక చరిత్రలను నేనెరుగుదును. జుట్టు ఇంగ్లీషు 'బి' (' ') లాగు ముందు గొరిగి, నల్లగా తళ తళలాడే వుంగరాలను దువ్వి ముడివేసి కృష్ణదేవరాయల ముఖానికి అందం అధికం చేయగల నల్లని పెద్ద మీసాన్ని సద్ది తెల్లని మల్లుషర్టూ, వుప్పాడ కండువా ధరించి, నడుస్తో వుంటే అతని బిగించిన పెదిమలూ, మధ్య చీలిన గడ్డమూ, విశాలమైన గంభీరమైన కళ్లూ చూస్తే, అతని తల్లికి యే వెలమదొర ఇతన్ని కటాక్షించారో అనిపిస్తుంది. మాధవుడు, మా వూరు కోర్టు మునసబుకు క్షౌరం చేస్తూ వుంటే, అతని



అంగవైకల్యము కనబడక పోవడం చేత, విగ్రహ గాంభీర్య మతిక్రమించి, చూసే వాళ్ళకి కోర్టు మునసబే మాధవుడికి క్షౌరంచేస్తూన్నట్లు తోస్తుంది. అతని చంకలో సంచి కనపడ్డప్పుడు కూడా అదేదో ఫోల్డింగ్ కెమెరా (folding camera) లేక టైప్‌రైట రనుకుంటారు. అది మంగలి పొది అని తెలిసినా, అతను మంగలి అని తెలిసినా, క్షవరానికి పిలవడమంటే యెంత వాడికీ జంకే, అతని సెలూన్‌లోకి వచ్చి చాలామంది మాధవుణ్ణి 'మంగలి యేడండీ?' అంటారు.

మాధవుడు తన కిష్టము వచ్చిన వాళ్ళకే గాని, అందరికీ క్షవరం చెయ్యడు. ఎంత వుద్యోగస్తుడైనా సరే, క్షవరం చెయ్యమని అడగగానే, మాధవుడు ముందు యెగాదిగా చూస్తాడు. పికిలి గెడ్డం, మకిలి గెడ్డం. చచ్చు మీసాలు, కొరుకుడు మీసాలు వున్నాయా, మొహాన్ని వుమ్మేసినట్టు అసహ్యంగా చూసి, మాట్లాడకుండా వీపు తిప్పి వెళ్ళిపోతాడు. అనుమానా స్పదంగా, మొహం మీద ఒక కురుపు, ఒక మచ్చ వుందా, డాక్టరు దగ్గిరికి వెళ్ళమని చెయ్యి వూపి, చూపులతో కాల్చి వెడతాడు. ఒకసారి సత్యనారాయణని రోడ్డు మీద చూసి, నీకు గడ్డం చెయ్యాలని ఉన్నదని పట్టుకొన్నాడు మాధవుడు. నున్నని చెంపలూ, విశాలమైన గడ్డమూ చూశాడా, భూములూ ఐశ్వర్యం దొరికినట్టు సంతోషిస్తాడు. ఒకసారి సంగమేశ్వర రావు భార్య చెంపలు గొరుగుతానని కూచున్నాడంటారు; ఎంతవరకు నిజమో! హరిసింగు మన వూరు వొచ్చినప్పుడు, అతన్ని రోడ్డుమీద చూసి, అతని తల మీదనే దృష్టి నిలిపి, కుంటివల్ల దూరమై, బండి చేసుకొని బంగాళా దాకా వెంటబడ్డాడు. అందరూ అతనితో మాట్లాడుతోవుంటే, మాధవుడు మాత్రంయిటూ, అటూ, చుట్టూ తిరుగుతో అతని క్రాఫ్ చూడడమూ, ఒంటికాలుతో గంతువేసి 'బలే, అచ్చా' అనడమూ, నాటకం చూస్తున్నట్టే చేశాడు. వితంతువులకు గొరగనని మాధవుడు నియమం పెట్టుకున్నాడు గాని, లేకపోతే, అతని తీవికీ, అందానికీ, కుంటికీ ఆ వూరి చెరువు గట్టున బాల శవాల ప్రతి రూపాలు చాలా కనపడేవే.

ఇట్లాంటి వాడికి రోజుకు నాలుగణాలు గిడతాయా? ముందు కుంటి, ఎంత పెందరాళే బయలుదేరినా, కుంటుతూ క్షవరం చెయ్యవలసిన ఇల్లు చేరేటప్పటికీ వాళ్ళు క్షౌరమై స్నానంచేసి భోంచేస్తూ ఉంటారు. పోనీ ఇతనికోసం కాచుకు కూచుంటే, యితని చెలచిత్త మొకటి వచ్చెను. మొదటిది అతను గొరుగుతూ వుంటే తలయెత్తి అతన్ని చూసి మరిచిపోయి ఎవరో పెద్దమనిషి యెందుకో తమ కోసం వచ్చారని తడబడే వాళ్ళు కొందరు! ఇతను తీరావచ్చి, కొత్తవారి మొహం చూసి, నాలుగు రూపాయలిచ్చినా నీ గడ్డం తాకనని పోతే, చిక్కునవడే వాళ్ళు కొందరు. పాత వాళ్ళయినా 'యీవాళమొహం సరిగా కడుక్కోలేదు. క్షౌరం చేయడానికి వచ్చా, గాని, పాకీ పనికి రాలే'దని వెళ్ళిపోతే, యేడ్చే వాళ్ళు కొందరు. క్రాపు చేస్తో చేస్తో పేను కనబడితే, ఛ! యీ తలని నేను తాకనని వెనక కొంతా, ముందు కొంతా చేసి లేచిపోతే యేం కావాలి మనుష్యుల పని!

కనక యింటింటికీ తిరగడం మాని, ముసలి పులి వలె చెరువు పక్క చెట్టుకింద చేరి, తృణ కంకణంవలె కత్తిని తళతళ లాడిస్తో, చేతికి దొరికిన వా తగిన శిక్ష చేసి పంపేవాడు కొన్నాళ్ళు. కాని యితర మంగళ్లు చేసిన క్షౌర వెక్కిరించడం వల్లా, తన క్షౌరానికి అమితంగా డబ్బు అడగడంవల్లా యితని వ్యాపా పడిపోయింది. పెళ్ళాం నాను అమ్మి ఒక అతి వాస్తవిక కవికి నాలుగు సార్లు వుచిత క్రాఫ్ చేసి 'అన్ని రకముల క్రాపులూ, గడ్డాలు అతి నాజూకుగా, పరిశుభ్రము చేయబడు' నని గద్యపద్యం పాతకాయితం మీద రాయించుకుని, అది బల్ల గీయించుకుని, దాన్ని వేళ్ళాడకట్టాడు. మామూలుగా భారతి ముఖ చిత్రం చిత్రకారుడి మేనకోడలికి ఆరుసార్లు ముంగురులు కత్తిరించి క్రాపు చి వేయించుకున్నాడు. ఆ బొమ్మ రెవికలేని ముసలి సరస్వతికీ బాలకృష్ణుడు జు కత్తిరిస్తున్నట్టు కనపడేది అనేవాళ్ళు. తెల్లవారకట్టనే లేచి, ముందు తన ముఖ గిరజాలకీ సేవ చేసుకుని, పెద్ద మీసాల్ని దువ్వి తన మందిరం గుమ్మంలో వచ్చేవా ఆహ్వానిస్తో, ఆనందమూ ఆదరణా వొలికే చూపు తయారుగా పెట్టు నుంచుంటాడు. సారంగధర నాటకానికి ఆరుసార్లు వెళ్లి చిత్రాంగి సారంగధరు ఆహ్వానించేప్పుడు నరసింహారావు పెట్టిన చూపు పెట్టాననుకుని, దానికి అనుకరణం ఈ చూపుని సంపాయించాడు. కాని నరసింహారావు నటనాలోపమో, మాధవు అనుకరణ లోపమో మొత్తానికి, ఆ ఆహ్వానపు చూపు మీద పడగానే, ఆ లోప వొస్తున్న మనిషి సరాసరి గొంతుకులో కత్తి గుచ్చిన కోడి వలె గిజగిజలాడి వె రెండడుగులు వేసి 'కాఫీ హోటలు అనుకొన్నా'నని గొణిగి, తిరిగి చూడక పలాయనమౌతాడు. ఇట్లా పరిగెత్తిన వాళ్ళలో ముఖ్యుడైన నారాయణ 'యేమి ఆ మాధవుడు అట్లా చూస్తాడు! గూడులోకి వచ్చే ఈగని సాలీడు చూసినట్లు!' అన్నా మనుష్యులందరూ పారిపోవడం చూసి మాధవుడు ఇంకో ఉపాయం కనిపెట్టా ఒంటికాలిమీద గంభీరంగా నుంచుని వున్న వాడల్లా, కొత్తవాడు రాగానే, ఆ మ గాలి తగలగానే, బాలెన్సు తప్పివెనక్కి పడేట్టు వూగుతాడు, భయపడి ఆ మాధవు పట్టుకోపోగానే, ఆ మాధవుడే వూతాని కన్నట్టు వాళ్లని పట్టుకుని లోపలికి లా క్షౌరం చేస్తాడు.

ఇంకా ఇంటివద్దనించి ప్ర్లాదుడివలె పోట్లాడి పరుగెత్తుకుని మాధవావ కోసం బయలుదేరిన నాకు ఒక మంగలీ కనబడలేదు. నా గాబరాలో ఒళ్లు తె బోర్డు చూసి మాధవుడి గృహంలో ప్రవేవించాను. లోపల తల పెట్టడంతోనే, మొ మీద చెంబెడు చన్నీళ్ళు కొట్టినట్టు మాధవుడి గృహంలో ప్రవేశించాను. లోపల పెట్టడంతోనే, మొహం మీద చెంబెడు చన్నీళ్ళు కొట్టినట్టు మాధవుడి చూపు 'ఇక్కడ మామయ్య లేడే.' అని వెనక్కి వెళ్ళి పోతుండగా మాధవుడు 'దయచెయ్య అంటో ముందుకు నామీద వాలి, ఒకచేత్తో జుట్టూ, రెండో చేత్తో మెడా పట్టు



ఏమీ కనపడకండా నా మీద అనుకుని, కుంటుకుంటో తీసుకుపోయి, కుంటి కుర్చీలో తోశాడు. నా జుట్టుని వదలక, పట్టుకునే దూరంగా వున్న కత్తెర నందుకుని 'యెట్లా?' అన్నాడు? ఆ నిమిషాన మా. యిద్దర్నీ యెవరైనా చూస్తే అశ్వద్ధామ దుష్టద్యుమ్నుణ్ణివలెనన్నా, నరాంతకుడు 'నిన్నెట్లా చంపమన్నావు? జబ్బ పట్టుకుని వెనక్కి వొంచి కంఠంలో పొడవనా, కిందికి లాగి గుండెలమీద కాలేసి మెల్లిగా వెనకనించి కోడినికోసినట్టు కొయ్యనా, తలమీదనించి కొబ్బరిబొండం మల్లే చిల్లిచేసి రక్తం పీల్చనా, నా చాకచక్యం తెలిసేట్టు అక్కడక్కడ చదరంగా గాట్లు చేసి, చెట్టులో రావి పాలమల్లే రక్తం స్రవింప చెయ్యనా?' అని అతి వాత్సల్యంతో ప్రశ్నిస్తున్నట్టు కనబడివుండేది అవన్నీ తెలీక నేను 'క్రాఫ్' అన్నాను.

"ఏంక్రాపు? బెంగాలీ, ఆస్ట్రోజపానీసు, కాకేషియన్, పెరూయిష్, జర్మన్ సిల్వరీ, అయితానగరం, హావేలియన్, ఆత్మగౌరవం, గాంధి ఇర్వియన్, న్యూ థియేటర్సు-ఏది?" అన్నాడు.

"హిమాలయన్ క్రాఫ్" అన్నాను.

'హిమాలయన్' అన్నాడు అతను తను కూడా. ఒక్క నిమిషం ఇటూ అటూ ఎవరూ లేకుండా చూసి ఒక్క దెబ్బన నా జుట్టు ముడి కంఠం నరికి, వైద్యుడు దంతం పెరికి కళ్ళముందు పెట్టినట్లు నా జుట్టు ముడిని నా ముందు ప్రదర్శించి, తన ప్రజ్ఞను మెచ్చుకోమన్నట్లు గర్వంగా నా వంక పెళ్ళికూతురు వంక పెళ్ళికొడుకు చూసినట్టు చూశాడు. 'ఇంకా ఈ తమాషా కూడా చూడు, నేనెంతటివాణ్ణో నీకే తెలుస్తుంది' అన్నట్టు నా భుజం మీద చెయ్యేసి, నా చుట్టూ కుంటుకుంటో ప్రదక్షిణం చేసి తలకాయ పట్టుకుని వీపుమీద గుద్దపోయేవాడిలాగు కుర్చీకిందికి నన్ను వొంచాడు. ఎప్పుడైనా నీ తొడల మధ్యనించి, కుర్చీ కాళ్ళలోంచి ప్రపంచాన్ని చూశావా? ఈసారి ప్రయత్నించు. పోనీ, ప్రపంచాన్నంతా చూడనక్కర్లేదు శ్రీరామ పట్టాభిషేక పటం చూడు. అంజనేయుల కాళ్ళ కిందనించి.

నా కళ్ళముందే నల్లులు నా తొడల్ని శేషాద్రి వేడి యిడ్డెన్లలాగు పీక్కుతింటున్నాయి. రోగి పక్కనున్న పాలు తాగేపిల్లికి అతనిఅసహాయ స్థితిని గురించి ఎంత ధైర్యమో, కట్టేసిన కుక్కని చూస్తే కాకికి ఎంత సాహసమో, మాధవుడి చేతిలోని క్షౌరాతురుణ్ణి చూస్తే నల్లుల కంత ధైర్యం. కుర్చీ చిల్లులు లెఖ్ఖ పెట్టాను. కింద న్యూసుపేపరు ముక్క పడివుంటే దాంటో మకిలి కప్పని అమృతాంజనం సుగుణపు మాటలన్నీ భద్రంగా వొప్పగించగలిగేట్టు బట్టీ పెట్టాను. పక్కన తిరపతి క్షేత్రంమీద అమాంతంగా యం. యస్. యం. రైల్వే వాళ్ళకి కలిగిన మహత్తర భక్తి విశేషాల్ని గ్రహించాను. నా మెదడు తలకిందలు కావడం చాతనో ఏమో, ఆ నిమషాన టీచర్లకీ విద్యార్థులకి చాలా సహాయభూతమైన విషయం నాకొకటి తోచింది. ఈ విషయాన్ని కాపీరైటు చేయించి అధికధరకు అమ్ముదామనుకున్నాను గాని, ఈ టీచర్ల

గర్భదారిద్ర్యాన్ని,స్వల్పవేతనాల్ని, రూపాయికి అణా కట్లనీ గమనించి, ఉచితంగా ప్రకటిస్తున్నాను. పిల్లలకి పద్యాలన్నా, ఎక్కాలన్నా, స్పెల్లింగులన్నా తప్పులేకుండా రావాలంటే, వాటిని పకోడీలూ, ఉప్మా పొట్లం కట్టిన మంచి మకిలి కాయితం మీద రాసి నేల మీద పెట్టి, బల్లమీదకూచున్న కుర్రదాని తలని వొంచి కాళ్ళమధ్య నించి కాయితం కనబరుస్తో, టీచరు ఒంటి కాలిమీద కుంటుతో, ఆ పిల్ల తలెత్తకండా కత్తితో జడిపిస్తో చుట్టూ తిరుగుతో వుంటే అప్పుడు నేర్చుకున్న విద్య కుర్రది కాన్పులైనా మరిచిపోదు.

మాధవుడి కత్తెరకి వుత్తమమైన అలవాటు ఒకటి వుంది. దాన్ని నాగపూరులో సంపాయించిందంటాడు. ఆ కత్తెరని మాధవుడు జాలారు పేటలో కొన్నాట్ట. మాధవుడు వెంట్రుకని కత్తిరించపోయినప్పుడు ఆ కత్తెర వెంట్రుకని మలేరియామల్లే, మళ్ళీపెళ్ళిలో హీరోయిన్ను,ని హీరో మల్లే పట్టుకుని మళ్ళీ వొదలదు; తనతో లేచి రమ్మంటుంది. కత్తెర రమ్మనడం, వెంట్రుక రాననడంఫిల్ములో చూడడం బాగానే వుంటుంది. కాని వెంట్రుక సొంతదారుడికి ఆ ప్రణయ కలహం ప్రాణాంతకంగా తోస్తుంది. ఇదే ఎంకి పాటల ద్వారా ఆధ్యాత్మికపరంగా కొందరు వరలోక వాస ప్రయాణీకులు అర్థం తీశారు.

ఎంకి ముూథాత్మా, నాయుడు పరమాత్మా కాగా లేనిది కత్తెర బావా, వెంట్రుక వెంకీ కాకూడదూ? కావచ్చు. కానీ ఆ ఆత్మల ఆరాటం నీ తల మీద జరిగితే మాత్రం, అందులో వొరసగా వేలకొలది యెంకుల్ని ఒకే నాయుడు బావ, శ్రీకృష్ణుడిమల్లే బలవంతంగా పైకి లేవతీసుకు పోతో వుంటే మాత్రం, ఆ ఎంకుల ఏడుపు భరించడం కష్టం.

నాయుడు ఉంటే 'నా సొగసు నన్నైన సూసు కోనీడమ్మ' అంటుంది. వెడితే 'నన్నిడిసి పెట్టేళ్ళినాడే' అని యేడుస్తుంది ఎంకి.

ఏమైతేనేం ?

"నీ తోటి నే రాను కత్తెర బావా,
నీ మాట నే యిన్ను కత్తెర బావా,
సరుకులన్ని యిస్తాను, ఎంట్రిక పిల్లా,
నల్లగుండు పద్దాక, కత్తెర బావా,
ఏడనే నీ కాపురమో ఎంట్రిక పిల్లా
ఈడి తలమీదె కాపురమో కత్తెర బావా."

★ ★ ★

# విచిత్రనళీయం

అనగా అనగా చేధినగరంలో భీమరాజని ఒక రాజు వుండేవాడు. ఆయనకి దమయంతి అని ఒక కూతురు. ఆమెకి పదహారేళ్ళు వొచ్చాయి. ఆమె చాలా చక్కని పిల్ల. నిషధపురంలో వుండే నలుడనే ఆయన్ని వొకసారి చూసి, అప్పట్నించి ఆయన్ని గాఢంగా మోహించింది. యెన్ని మంచి సంబంధాలు వచ్చినా వొద్దంటుంది. చివరికి ఆ దమయంతి కలవరింపుల వల్లా, ఆమె రాసి అక్కడక్కడ పారేసిన చీట్ల వల్లా అమె మనసు నలుడి మీద నిలిపిందని తెలుసుకుని, ఆ నలుడి దగ్గరికి మనిషిని కబురు పంపారు. ఒక మంచి సంబంధం వుందనీ, ఆ పిల్ల మనసు నలుడి మీదనే నిలిపిందనీ, ఆ వంశములో పెళ్ళి చేసుకోడం చాలా అదృష్టమనీ నలుడితో చెప్పారు.

"నామీద మనసు నిలిపిందా? అంతకు ముందెంవరి మీద నిలిపిందో! చిన్నప్పుడే పెళ్ళి చేయక, యీ సంఘ సంస్కర్తల మాటలు విని, పిల్లల్ని యీడు వొచ్చిందాకా వుంచితే ఇదే అనర్థం. మీ వూరు నించే ఎవరో పిల్ల రోజుకో వుత్తరం రాస్తోంది. రెండు రిజిష్టరు వుత్తరాలు కూడా పంపింది. మిమ్మల్ని కూడా ఆమే పంపించి వుంటుంది. ఇదివరుకు నేను పెళ్ళి చేసుకోలేదయ్యేను. నాకు యీ విషయాల్లో ఆ అమ్మాయికున్న అనుభవం లేదు. పెద్దవాళ్ళ నడుగుదామంటే, మా వాళ్ళందరూ, నన్ను పెద్దవాణ్ణి చేసి చచ్చారు. ఐనా సరేలెండి-యే మాత్రం కట్నమిస్తారు ? ఇంత వరుకూ పాట మూడు లక్షల వరుకూ పెరిగింది" అన్నాడు. నిరాశ చెంది మనిషి వెళ్ళాడు.

"అంతకట్న మెక్కడిస్తా" మన్నాడు భీమరాజు. దమయంతి మంచం పట్టింది. యెన్ని కబుర్లు పంపినా నలరాజు యేమాటా చెప్పలేదు. అడిగిన కొద్దీ ఇట్లానే బిగుస్తాడనీ, చివరికి పత్రికలో ప్రకటన వేయించారు.

"వెలమ వరుడు కావలెను"

పదహారేళ్ళ వెలమ కన్నె. రూపవతి, విద్యావతి, ఆరోగ్యవతి, కట్నము రెండు లక్షల రూపాయలు; రెండు వందల ఏనుగులు, ముప్పై ఆవులు, నూరు వేట కుక్కలు, యాభై గుర్రాలు. వరుడు వెలమ కులస్తుడూ బలశాలీ, విద్యావంతుడై వుండవలెను.

"దరఖాస్తులు 'బీ', కేర్ ఆఫ్ రాచపత్రిక, అని పంపవలెను."

వేలకువేలు దరఖాస్తులు వొచ్చాయి. కట్నం తప్పిపోతుందేమో నలుడుకూడా వాళ్ళు అనుకున్నట్టే, దరఖాస్తు పంపాడు. పోస్టులో నలుడి ము కవరు వచ్చిందని వినగానే దమయంతి చివాలున మంచం మీద నుంచి లేచి, తల పోసుకొని కాఫీ తాగి, మూడు వేలమంది ముత్తయిదులకీ ఫలప్రదానమూ, అరు బ్రాహ్మణ్యానికి సంతర్పణా, గుడ్డి వారికీ కుంటివారికీ అన్న వస్త్రదానమూ చేయించి

అక్టోబరు పదో తారీఖున, మీన లగ్నాన స్వయంవరం పెడదామనుకున్నా కాని దమయంతి అంత కాలమా ఆగడం?" అనడం చేత, ఆగస్టుకు మళ్ళీ ప్రకటన చేయించారు;

"రాచకన్య పాణికై దరఖాస్తుదారులందరూ
ఆగస్టు 24 గో తేదీన మూడో జాము మొదటి
పాదాన చేదినగరంలో భీమరాజుగారి ఇంటివద్ద,
సరిగా ఉదయం పదిగంటలకు హాజరు కావలెను.

విస్తారముగా ఇది వరకే వొచ్చినందున, ఇటుపైని యెటువం దరఖాస్తులునూ అంగీకరింపబడవు."

స్వయంవరంనాటి వరకూ దమయంతి మూర్ఛలతోనూ, శీతలో చారములతోనూ గడిపింది. విరహ గీతాలు రాసి, అనేక పత్రికలకి పంపింది. వా కాపీలన్నీ యెప్పటి కప్పుడు నలుడికి అందజేసింది.

చివరికి స్వయంవరం ఆసన్నమయింది. నలుడు చక్కగా టై, కా అలంకరించుకుని, మీసాలు దువ్వుకుని, సొంత మోటారులో చేదిపురం చేరుకున్నా యెదురుగా మైదానంలో ఏరోప్లేనులోనించి నలుగురు తెల్ల దొరలు దిగారు.

నలుడు వాళ్ళ దగ్గిరికి వెళ్ళి -

"యీ యంత్రం ఖరీదెంతవుతుంది?" అని అడిగాడు.

"యభై వేల రూపాయ" లన్నారు.

"కట్నంలో ఇంక లక్షన్నరేనా మిగిలేది, ఇటువంటి దొకటి కొంటే" అనుకున్నాడు.

"యామన్నా తగ్గించడానికి వీల్లేదా?" అన్నాడు. దొర ముఖ్యుడు నలు యెగాదిగా చూసి.

"మాకో సహాయం చేసి పెడతావా మరి?" అన్నాడు.

"చెప్పండి."

"ఈ రాజు కూతురు దగ్గిరికి పోయి మమ్మల్ని పెళ్ళి చేసుకోమని చెప్పి వొస్తా



"మీరెవరు ?"

"బెంగుళూరి పొగాకు వర్తకులం."

"మీలో ఎవర్ని పెళ్ళి చేసుకోవాలి ?"

"నలుగుర్నీ."

"నలుగుర్నీనా ?"

"మీలో ఒకామె ఐదుగుర్ని చేసుకుందటగా !"

"దానికి మా రుషులు ఒప్పుకున్నారు."

"దీనికి ఒప్పిద్దాం."

"రుషులిప్పుడు లేరు."

"యెక్కడికి వెళ్ళారు?"

"యేమో!"

"ఒక రిద్దర్ని కొందాం."

"దొరకరు."

"పోనీలే, మాలో ఒకర్నైనా సరే, పెళ్ళి చేసుకోమను."

రెండు లక్షలూ పోయేట్టున్నాయని నలుడికి గుండెల్లో రాయి పడ్డది.

సరే, నేను ఆమె దగ్గరికి లోపలికి వెళ్ళే విధమెట్లా ?"

"ఆడవేషం వేస్తాం."

'వెళ్ళి, వీళ్ళకి టోపీవేద్దా' మనుకున్నాడు.

"సరే, మీ యంత్రం ఖరీదెంత తగ్గిస్తారు ?"

"పదివేలు."

"ఇరవై."

"సరే."

మీసాలు గొరిగి, ఆడవేషం వేసి, వుంగరాలూ రిస్టు వాచీలూ ఇచ్చి అమ్ముతో పొమ్మన్నారు. నలుడు దమయంతి దగ్గరికి వెళ్ళాడు.

నలుడికి స్వాగత పద్యాలలో మూడోదాంటో మధ్యపాదంలో యతి కుదరక కొట్టుకుంటోంది దమయంతి.

"యేమిటా బాధ?" అన్నాడు.

"యతి కుదరలేదు."

"యేదీ, చదువు."

యతి వేయించాడు. ఆమె రత్నాలహారం అతని మెడలో వేసి, "నువ్వెవరు?" అంది.

"నువ్వెవర్ని పెళ్ళి చేసుకుంటావు?"

"నలుణ్ణి"

"దొరలొస్తే?"

"నాకు ఒద్దు."

"ఇంకెవరన్నా ఒస్తే?"

"నాకు ఒద్దు."

"ఆ దొరలు చాలా బలవంతులు, ధనవంతులు."

"ఐనా నాకు ఒద్దు."

"వెర్రిదానా, ఆ నలుడు నీ కెందుకు ?"

"నా కతనిపైని ప్రేమ."

"ఎందుకు?"

"ఆ కారణాలు చెప్పడానికి వీల్లేదు. పోనీ పటంలో అతని మీసం చూశావా చూస్తే నువ్వే ఎగపడతావు, అతని కోసం!"

"ఆ నలుడు నిన్ను ఒద్దంటే !"

"చచ్చిపోతాను."

"తాడుతోగాని, నుయ్యిలోగాని...."

"ఆ మాట మీదనే వుంటావా."

"తప్పకండా."

"కట్నం నిజంగా ఇస్తారా?"

"ఆ"

"ఆ నిమషాన్నే చెల్లిస్తారా?"

"ఆ"

"సరే, శలవు"



తిరిగివొచ్చి, దొరలతో, దమయంతి వొప్పుకోలేదని చెప్పి, రిస్టు తిప్పి చూసేటప్పటికి పదయింది. సభా స్థానానికి పరిగెత్తాడు. అనేక మంది ప్రభువులు ఆసీనులై వున్నారు. దమయంతి సర్వాలంకృత అయి పుష్ప హారం చేతులో పట్టుకొని, కుర్చీలోయెదురుగా కూచుంది. యీ పక్కన తండ్రీ, ఆ పక్కన సఖి కూచున్నారు. ముందు బల్లమీద అప్లికేషన్ల కట్టలున్నాయి. దమయంతి సులోచనాలు పెట్టుకుని, అన్నీ పరీక్షించి, నలుడి దరఖాస్తు బైటికి తీసింది.

సఖి "నలుడూ, నలుడూ!" అని అరిచింది.

నలుడు "హాజర్" అని లేచి నుంచున్నాడు.

"ఈయన కాడు" అంది దమయంతి.

"నేనే" అన్నాడు నలుడు.

"అబద్ధం-"

"కాదు. నేనే."

"అయితే నీ మీసాలేవీ."

"పొద్దున్న దొరలు గొరిగారు."

"నమ్మను. నిన్ను తెలిసిన వాళ్ళెక్క డెవరన్నా వున్నారా?"

"యీ దొరలు."

దొరలు "మాకు మీసాలున్నాయి, మేమే నలుల" మన్నారు. "మమ్మల్నీ పెళ్ళి చేసుకుంటే యేరోప్లేనులో తిప్పతాం. చేసుకోకపోతే తంతా" మని రివాల్వర్లు బైటికి తీశారు. సిపాయి 'మ్యూటినీ' జ్ఞాపకానికి తేగా కూచున్నారు.

ఇంక విధిలేక, దొరలని పెళ్ళి చేసుకుని గొడ్డు మాంసం తినాలని బయపడి. "మళ్ళీ నువ్వు నలుడివి కాకపోతే ఈ స్వయంవరం రద్దు చేసుకునే షరతులమీద నిన్ను వరిస్తున్నా"నని పూలహారం సగం తుంపి నలుడి మెడలో వేసింది.

అందరూ భోజనాలుచేసి, యెవరి యిళ్ళకు వారు బయలుదేరారు.

తెల్లదొరలు నలుగురూ విమానమెక్కి బెంగుళూరు వెడుతూ వుండగా పాకాల దగ్గిర ఇంకో చిన్న విమానమెక్కి 'సని' అనే పొట్టి బొండుదొర యెదురుపడ్డాడు.

అతడు గుఱ్ఱపు పందాల అడ్డావిడిలో స్వయంవరం సంగతి మరిచిపోయి ఆలస్యంగా వొస్తున్నాడు. స్వయంవరం అయిపోయిందని వుడుకు మోతుతనం వొచ్చి, నలుడినించి ఆ రెండు లక్షలూ లాగాలనుకున్నాడు. దానికోసం పందాలలో లాభ మొచ్చిన వెయ్యి రూపాయిలూ పెట్టుబడి కింద పెట్టి, నిషధపురంలో బ్రాందిషాపు

తెరిచాడు. నలుడి బావ, పుష్కలుడనే వాడితో యీ 'సని' స్నేహంచేసి, వాడి ద్వా
నలుడికి ఆప్తుడైనాడు. వీళ్ళు చల్లగా యెంత ప్రయత్నించినా, నలుడు తన లోభత్వం
కాపాడబడి, వారి మాయలకి లొంగలేదు, మొదట్లో.

మూడేళ్లు గడిచింది. యేడాది కొకరు చొప్పున దమయంతి ఇద్దరు పిల్ల
కన్నది. నలుడికి సంసారం మీది మోజు తగ్గింది. ఇంటోకూచుంటే యెప్పుడూ యే
తోస్తుంది? చేధినగరం కబుర్లు యెన్నని చెపుతుంది దమయంతి? ఆ పిల్ల
ఆటపాటలు చూసి యెంతకాలం సంతోషిస్తో వుండగలడు నలుడు? మోటారుమీ
షికారు పోదామంటే, దమయంతీ ఒస్తానంటుంది. అది అమర్యాద కర
ఉద్యానవనంలో తిరిగి తిరిగి, చెప్పుకుని చెప్పుకుని చెట్ల పేర్లన్నీ ఒచ్చాయి. రా
నక్షత్రాల పేర్లు వింటే డోకు ఒచ్చే పర్యంతమయింది. అందువల్ల నలుడు క్రమం
పుష్కలుడితోనూ, సనితోనూ చీట్లపేక మొదలు పెట్టాడు. మూడు నెలల్లో సిగరెట్లు
అరు నెలల్లో డబ్బులు పెట్టి జూదం, తొమ్మిది నెలల్లో బ్రాందీబుడ్లు అలవాటైనాయి
ఒక్క యాడాదిలో ఇల్లు అంతా గుల్లయింది. తండ్రి చిన్నప్పటి నుంచి బోధించి
పతివ్రతా ధర్మం ప్రకారం, దమయంతి, భర్త కెదురు చెప్పక నగలూ, ధనమూ అ
నవ్వుతో యిచ్చేసి, యీ త్యాగంవల్ల, ఒచ్చే జన్మలో, ఇతనే మంచి భర్తగా సంభవిస్తా
సంతోషపడుతోంది. ఒకరోజు పుష్కలుడూ, 'సనీ' బాగా తాగి ఇంట్లో ప్రవేశిం
దమయంతిని చాలా అవమానం చేశారు. నలుడు అరాత్తుగావచ్చి, నౌకర్ల సహాయం
ఇద్దర్నీ చావతన్ని వెళ్ళకొట్టాడు. ఆ కోపాన వాళ్ళిద్దరూ తమకు బాకీవున్న సొమ్ము
దావా తెచ్చారు. నలుడు దివాలా దరఖాస్తు దాఖలుచేసి, సిగ్గు భరించలేక
వూరినించి ప్రయాణమైనాడు. ఇద్దరు పిల్లల్నీ, భార్యనీ పుట్టింటికి పొమ్మన్నాడు. కా
భర్త ఒదిలిన భార్యని పుట్టింటి వాళ్ళు పెట్టే తిప్పలు తమయంతి ఆలోచించుకుం

"అయ్యో, మీరు వూరువూరు తిరగడంలో వుండగా నేను పుట్టిం
సుఖపడనా! ఏం మాటలివి? భార్య భర్త నీడ, సీత రాముడితో సకలమైన కష్టాలు
పడి చివరికి సుఖపడలేదా! నేనేం సీతకి తీసిపోయానా? మీతోనే నేనూ వొస్తాను
అని పెంకెపట్టు పట్టింది. ఇంక విధిలేక నలుడు ఒప్పుకున్నాడు. పిల్లలిద్దర్నీ
పుట్టింటికి పంపింది దమయంతి. తండ్రితో తానూ, భర్తా తీర్థయాత్రలకి పోతున్నామ
చెప్పమని కబురంపింది.

ఇద్దరూ వూరురా బిచ్చమెత్తి తింటూ తిరిగారు. కాని నలుణ్ణీ, దమయంతి
చూసిన వాళ్ళందరూ, "ఒరే, శుభ్రంగా తిండిపోతులాగున్నావు, కూలివని చెయ్యరాదా
నీకు బిచ్చమెందుకు?" అనీ, దమయంతిని చూసి "మా ఇంట్లో దాసీవని చెయ్యరాదా
అనీ అడిగేవారు.



కనక దమయంతి ఒక్కత్తేవెళ్ళి, "నా కెవరూ దిక్కులేరు. నా భర్త ఎవత్తెనో తీసుకు లేచిపోయా"డని చెప్పి బియ్యం ముష్టి తెచ్చుకుంటే ఇద్దరూ ఒండుకు తినేవారు. తక్కిన బిచ్చగాళ్ళతో జూదమాడి, నలుడు తన చొక్కానీ పంచనీ వోడిపోయినాడు. అందుకని దమయంతి చీరెలో సగం కట్టుకుని తిరగాల్సి ఒచ్చింది.

ఒకరోజు బియ్యం చాలా తక్కువగా దొరికాయి. యిద్దరికీ చాలలేదు. "నేనూ సంపాదించింది. నా కెక్కువ అన్నం రావాలి" అంటుంది దమయంతి. "భర్త ఆకలి తీరిన తరవాతగాని భార్య భోజనం చేయకూడదని ధర్మశాస్త్రాలలో వుం"దంటాడు నలుడు. "ధర్మశాస్త్రాలు వూళ్ళల్లో గాని, అడవుల్లోనా" అని మంకుపట్టు పట్టి, అరిచి, కోయవాళ్ళతో చెప్పుకుని, తనే అంతా తినేస్తోంది దమయంది. నలుడు విస్తరి చించివేసి, మెతుకులు వెదజల్లి దమయంతిని ఒదిలి కోపంతో తాను సుఖంగా పోయినాడు. అట్యాంటి దుర్మార్గుణ్ణి దేవుడు వూరికే ఒదులుతాడా? వెంటనే ఓ పాము చేత కరిపించాడు. నలుడు భయపడి దగ్గరవున్న వూరికి పరిగెత్తి చికిత్స చేయించుకున్నాడు. ఆ మందు విషాన్ని విరిచిందిగాని, దాని వుధ్రుతంవల్ల నలుడి శరీరాన్ని పుడుకెత్తించి, తన తల్లి కూడా అతని రూపం గుర్తు పట్టకుండా మార్చేసింది యిదీ మంచికే కలిగిందనుకుంటో తిరిగి తిరిగి, రుతువర్ణుడనే రాజువద్ద వంటవాడుగా కుదిరాడు అతను.

యిక్కడ దమయంతి యేడ్చి, యేడ్చి, నలుడికోసం వెతుక్కుని అన్నమంతా యిస్తానని పిలిచి పిలిచి, కసితీర తిట్టుకుని బైలుదేరి వెడుతూ వుండగా, ఒక ఎరుకలరాజు ఆమెని చెరపట్టాడు.

అబల యేం చేస్తుంది? ఒకరోజు వాడు నిద్రపోతూ వుండగా వాడి మంచానికి నిప్పంటించి, "నేనే పతివ్రతనైతే వీడు భస్మమౌ గాక!" అని శపించి, తన దోవన వెళ్ళిపోయింది. మధ్యలో కొందరు వర్తకుల్ని కలుసుకుని వాళ్ళతో స్నేహం చేసి, చివరికి చేదినగరం చేరింది. తల్లి దండ్రులు కూతుర్ని గౌరవించి ఇంట్లో వుంచుకున్నారు.

కొన్నాళ్ళ కావూరి వితంతు వివాహపు ఏజంటు వొచ్చి, దమయంతిని మళ్ళీ వివాహం చేసుకోమని ప్రోత్సాహించాడు. బీదవాడైనా, బుద్ధిమంతుడైన కుర్రాణ్ని వరుడుగా చూసేటప్పటికి దమయంతికీ సరదా పుట్టింది. కాని నలుడు చావలేదేమోనని అందరికీ దిగులూ, భయమూ పట్టుకుంది. అందువల్ల మళ్ళీ రాచపత్రికలో ఈ విధంగా ప్రకటన చేయించారు.

"గొప్ప బహుమానము

నలుడు మరణించిన సంగతి రూఢిగా తెలియజేసిన వారికి."

ప్రత్యుత్తరం యెక్కడ నుంచీ రాలేదు. దమయంతి తాళలేక తహ తలాడిపోతోంది. వివాహ ముహూర్తం నిశ్చయించారు. కానీ రాచపిల్ల గనకా,

పునర్వివాహానికైనా స్వయంవరం కూడదని శాస్త్రాలలో లేదు గనకా తిరిగి స్వయం ప్రకటించారు. కట్నం నాలుగు లక్షలన్నారు.

నలుడీ ప్రకటనలన్నీ చూస్తోనే వున్నాడు. రుతువర్ణుడు చదివి పత్రిక వంటకాయితాలకింద పారేస్తోవుంటే, పొయ్యి దగ్గిర నలుడు చదువుకుంటూ వుంటా మళ్ళీ తనని కనుక్కుని తీసుకుపోయి, ఆ దమయంతికీ, పిల్ల కడతారేమోనని అతని భయం.

దమయంతికి ద్వితీయ వివాహ మనేటప్పటికి అతని కతి సంతోష మయి యెందుకంటే, అతనికి ఆ ఇంట్లో దాసీపైని మోహం పుట్టింది. దానికి అయిదువంద రూపాయల ఆదాయముంది. కాని ఈ నాలుగు లక్షల కట్నమో! తనే పెళ్ళి చేసుకు తనకే దక్కుతాయిగా. అయిదు వంద లెక్కడ, నాలుగు లక్షలెక్కడా కాని ఈ గొ వాగ్దానమిచ్చాడే! అయినా తనకి భార్యా బిడ్డలుండగా దీన్నెట్టా వివాహం చేసుకోవ తనకి సాటా, కులమా, బంధువా?

అందరూ స్వయంవరానికి కూచున్నారు. సిగ్గుతో, దమయంతి వచ్చి యువకుడి మెళ్ళో పూలహారం వేసింది. ఇంతలో వెనుకనించి కురూపి ఒకడు "ఇది వీల్లేదు, ఇది నా భార్య!" అన్నాడు. ఎంత చెప్పినా వినలేదు. పిచ్చివా పోలీసుల్ని పిలిచి ఒప్పచెప్పారు. విచారణ జరిగింది. నలుడు తన ఐడెంటిటీ రు పర్చాడు. దమయంతి తన యువకుడి చెయ్యి చప్పున ఒదిలి, పూలదండ తె నలుడిమీద పడేసి నమస్కరించింది.

"నాలుగు లక్ష లియ్యండి" అన్నాడు.

"మళ్ళీ నాలుగు లక్షలేమిటి, ఐన పెళ్ళికి!"

"ఐతే, నేను వెళ్ళిపోతాను."

"పో, ఇతనున్నాడు."

చాలా చిక్కు ఒచ్చింది నలుడికి. యేం తోచక కొడుకు దగ్గిరికి వెళ్లి

"నన్ను వెళ్ళమంటావా నాయనా?" అన్నాడు. కుర్రాడు లబ్బున యేడ్చి

"అమ్మా ఈ బూచాణ్ని పొమ్మను" అన్నాడు.

కాని దమయంతి మాత్రం నలుణ్ని ఒదలలేదు. పతివ్రత గనక.

★ ★ ★

# అట్లపిండి

(జెరుమీ ననుసరించి)

నా చిన్నతనంలో మాకు ఒక నాయనమ్మ వుండేది. ఆమె పేరు వెర్రి బామ్మ. కాని అట్లు బహు ప్రశస్తంగా వొండేది. ఆవిడ చేస్తే ఇంత వరకు ఒకసారిగా, పాతికట్లకంటే, తక్కువ తిన్నవాడు లేడు. మాలో ఆమెని, అందుకనే, అట్ల బామ్మ అనే వాళ్ళం. ఎట్లా చేసేదో ఆ పిండిలో 'ఏం కలిపేదో' ఎవరికీ తెలియదు. ఒకసారి నేను మా చెల్లెలుగారి ఊరు వెళ్ళుతున్నా. మా చెల్లెలు గర్భిణీతో ఉండి బామ్మ అట్లు తినాలని వుందని ఉత్తరాలు రాస్తోంది. బామ్మ ఏం చేసిందంటే, పిండి కలిపి, ఒక పెద్ద సత్తెప్పాలలోవేసి, సిబ్బి బోర్లించి, గుడ్డ వాసిన కట్టి, నన్ను ముందు తీసుకెళ్ళమంది. మర్నాడు తను బయలుదేరి వస్తానంది. చేబ్రోల్లో మధ్య ఒకరోజు దిగాను. మర్నాడు తెల్లవారి రైలుకొచ్చి, మూటా గిన్నె పెట్టుకుని, ప్లాటుఫారం మీదనుంచున్నా. దగ్గిర వున్న వాళ్ళందరూ మూటలూ ట్రంకులూ మోసుకుని దూరంగా పోతున్నారు. కారణం తెలియక, ఎందుకన్నా మంచిది పోని అని, నా మూటా, గిన్నా తీసుకుని, నేనూ వాళ్ళ వెనకాల వెళ్ళి నుంచున్నా. వాళ్ళు నా కేసి కోపంతో చూసి వెనక వొదిలిన చోటికే వెళ్ళి మళ్ళీ నుంచున్నారు. ఆలోచించా, ఎందుకా నన్నిట్లా ఏడిపిస్తున్నారని. ఒకవేళ ఈ అట్లపిండి వాసనేమో. కాని మా ఇంట్లో వాళ్ళందరికీ చాలా అలవాటే. అదిగాక ఆ వాసన తగిలేటప్పటికి సంతోషం కూడానూ.ఈ కాస్త భాగ్యానికే ఇంత అడావిడా; ఎంత సుకుమారం అబ్బా అనుకున్నా.

రైలంతా కిక్కిరిసి వుంది. నేనెక్కిన పెట్టెలో ఆ వూరి వాళ్ళెవరూ ఎక్కలేదు. వాళ్ళు కనిపెట్టే వున్నారు, నేనెక్కడ యెక్కుతానో చూస్తో.

నేనెక్కిన చోట ఇది వరకే పదిమంది వున్నారు, చోటు లేదన్నారు. కాని నా తప్పాలముందు తోసి, వెనకాల నేనూ ఎక్కాను. తప్పాల పైన బల్ల మీదపెట్టి, ఇద్దరు లావాటి వాళ్ళ మధ్య యిరికి, చాలా ///వుక్కగా వుందండీ యీవాళ అన్నాను. రెండు నిమిషాలయింది ఒక ముసలాయన ఇటు అటు కదలడం మొదలు పెట్టాడు "చాలా ఉక్కగా వుందండీ యిక్కడ" అని పెద్ద ట్రంకోటి మోసుకొని బయటికి బయలుదేరాడు. "ఇంకోచోట అసలు ఒకరి మీద ఒకరు నుంచున్నారండి" అన్నా ఆగలా. రెండో లావాటాయన కూడా లేచి వెనకాల వెళ్లాడు. ఒకర్ని ఒదిలి ఒకరు ఉండలేరు గాబోలు అనుకుని, హాయిగా సర్దుకున్నాము. ఇంతలో తక్కిన వాళ్ళందరూ "హూ. హూ"

అని ముక్కుల్తో అనడం మొదలు పెట్టారు, ఒకాయన మీద తెల్లని బొట్టు పర్త పైకి చూస్తే తప్పాల్లో పిండి కారుతోంది. బండి అంతా పరిమళం. అరాత్తుగా మాటైనా ఆడకుండా, నలుగురు లేచి బస్తాలు, ట్రంకులు దింపుకుని, బయిటి నడిచారు. మిగిలిన వాళ్ళం హాయిగా కాళ్లు జాచుకున్నాం. మిగిలిన వాళ్ళల్లో బ్రాహ్మడు, శవాలు మోశే వాడిలాగున్నాడు. "కుళ్లిన పసిపిల్ల శవం వాసన" అన్నారు ఆ మాటతో, అదిరిపడి, ఇంకా ముగ్గురులేచి, ఒకళ్ళ కాళ్ళకి ఒకళ్లు అడ్డం పడుతే బండిలోనించి కిందికి దొల్లారు. రైలు కదుల్తోంది ఆఖరికి ఆ బండికల్లా నేను పచ్చకోటాయినా మిగిలాము. "ఏమిటండీ ఈ కొంచానికి యింత అడావిడీ చేస్తారు వీళ్ళు? అంతా వేషం!" అన్నాడు. ఆయనికి చాలా జలుబు చేసింది. కానె రైలు బయలుదేరిన కాసేపటికల్లా, ఒక్కసారి గాలి రివ్వున కొట్టేప్పటికి, చాలా బాధపడటం మొదలు పెట్టాడు. ఆ జలుబూ గిలుబూ వొదిలి పోయింది. తరవాత స్టేషనులో కాఫీ తాగొస్తానని దిగి ఇంకో బండిలో ఎక్కేశాడు. చాలా నీచమయిన పని చేశాడనుకున్నా.

తరువాత, బండి అంతా నాదే. ప్రతి స్టేషనులో మనుషుల్ని హాయిగా వెక్కతే ఇటూ అటూ చూస్తే నిశ్చింతగా కూచున్న నన్నూ నా బండిని చూసి, కళ్ళకుట్టి "ఒరేయ్ శంకరయ్యా ! కాళీ బండిరా. ఇట్లారా, అని ట్రంకులూ, సంచులు మోసుకొచ్చి; తలుపు తెరిచి మెట్లెక్కి ; ముక్కుతో ఇటూ అటూ వూది, బండికేసి నా మొహంకేసి, చూసి, అమాంతం వెనకాల వాళ్ళమీద విరుచుకుపడేదీ. అందరూ అంతే ప్రతిస్టేషను దగ్గిరా అంతే. ఏ మెరగనట్టు, అటుకేసి మొహం తిప్పేసి కూచున్నా రయిలు కదులుతున్నా, అట్టే వుండిపోయినారుగాని, నా బండిలో మాత్రం ఎక్కలేదు

గిన్నె దించుకుని, హాయిగా, గోదావరి స్టేషనులో దిగాను. కూలీ మా యింటిదాకా ఒక అణాకి గిన్నె మోసుకొస్తానన్నాడు. గిన్నెనెత్తిమీద పెట్టాను. దించారు "రానండి" అని, వెళ్ళిపోయాడు. ఇదంతా చూస్తున్న ఇంకోడు ఆలోచించి, రెండణాల కొస్తానన్నాడు. గిన్నె నెత్తిని పెట్టుకున్నాడు. కష్టంతో బళ్ళదాకా నడిచాడు. దింపారు "నా చాతకాదండి బాబూ" అని వెళ్ళాడు. "పావలా యిస్తానని" కేకేశా. మాట్లాడకుండా నెత్తిమీద గుడ్డ తీసుకొని, వాసన చూసుకుంటూ, పోతున్నాడు.

ఆఖరికి అర్ధరూపాయకి బండి మాట్లాడుకున్నాను, వాడు మాత్రం వొదలదలచుకోలా, అసలు రెండణాలు మామూలు. మా చెల్లెలు గారింటికి. ఒక నిమిషం తరువాత "బాబూ కేపు చాలదు. ముప్పావలా యిప్పించాలి" అన్నారు కొంచెం దూరం తోలాడు. "ఒకరూపాయి యిచ్చినా కష్టంచాలదు" అని ఆపారు ఏం కష్టం? అది అతనికే తెలియాలి. ఎంత కష్టంగా లేకపోతే, అంత నశ్యం పీలుస్తారు! సరేనన్నా, ఏం చెయ్యను. అంతకంటే మళ్ళీ రూపాయన్నర కావాలి అనబోతున్నారు ఇంతలో గోదావరి మీదనించి గాలి విసిరింది, ఎద్దువేపు. ఎద్దు పరుగుమొదలు



పెట్టింది. గుర్రం పనికిరాదు. వెనకనించి ఏం వస్తూందనుకున్నదో, ఏమిటో బండి ఎవరి మీదనించన్నా పోతుందనుకున్నా, కాని బండి రాకముందే, గాలి తగలగానే ఎక్కడున్న వాళ్ళు అక్కడే ఇళ్ళల్లోకి, దుకాణాల్లోకి, పక్క సందుల్లోకి తప్పుకున్నారు. ఇంటిదగ్గర బండి ఆగితేనా? నలుగురు ఎద్దుని పట్టుకున్నారు. ముక్కులవతలికి తిప్పేసి. అప్పటికీ ఆగకపోయేదే? బండివాడు దూకి ఎద్దు ముక్కుకి గుడ్డ కప్పేసి, నశ్యం వాసన చూపించకపోతే. ఇంటిలోపలికి వెళ్ళాను, గిన్నా నేనూ. చెల్లెలూ పిల్లలూ పరిగెత్తుకుంటూ ఒచ్చారు. "అన్నయా" అనీ, "మామయ్యొచ్చాడు, మామయ్యొచ్చాడ' 'ని గదిలోకి. గుమ్మం దగ్గిర అందరూ తటాలున ఆగారు. కష్టంమీద మా చెల్లెలు మాత్రం మొహం మీద పమిటకొంగు కప్పుకొనివచ్చి, యేడుస్తో నన్ను కావలించుకుని, "అన్నయ్యా! యెందుకు దాస్తావు? చెప్పు నాతో యేం ఘోరం జరిగిందో" అంది. "ఏం లేదమ్మా బామ్మ యిచ్చిన అట్లపిండి" అన్నాను.

బామ్మ రాత్రికూ్కడా రాలేదు. మూడు రోజులు చూశాం రాలేదు. ఏం కదిపితే ఏమవుతుందో అని ఆ గిన్నెని అట్లానే వుంచాం. ఆ తలుపు మాత్రం గొళ్లెంవేసి, తాళంవేసి, శీలుచేసి, చిల్లుల్లో గుడ్డపేలికలూ అవీ కుక్కాము. ఎవరం ఆ వేపు పోలేదు. నేను స్నానంచేసి, సబ్బుతో కడుక్కున్నాను; కాని ఇంకా బజార్లల్లో నా గాలి తగలగానే మనుషులు, కలెక్టరు మోటారుముందు తప్పుకునేట్టు, తప్పుకోటం, మానలేదు. రెండు రోజులుండి మా చెల్లెలు, అట్ల ఆశ వదలుకుని ఇంక వూరుకోలేక "ఈ పిండి బామ్మ యేం చెయ్యమంది?" అని అడిగింది. "ఒచ్చిందాకా, ముట్టుకోకండా అట్లానే వుంచమంద"న్నాను. "చెప్పడమెందుకు? దాన్నెవరు కదిలిస్తారంది. మూడురోజులూ అయింది. పిల్లలు కొంచెంనలతగా కనపడ్డారు. ఆడుకోరు. అక్కడక్కడ దిగులుగా చతికిలబడతారు. చంటిపిల్ల కారణం లేకండా మారాంపట్టి యేడుపు. బామ్మకి ఉత్తరాలు రాశాం; రిప్లయి ప్రీపెయిడు టెలిగ్రాములిచ్చాం! జవాబు రాలేదు. నాలుగో రోజున మా చెల్లెలంది "ఒక రూపాయి ఇచ్చి, దీన్ని అవతల పారేయిస్తే బామ్మ కోప్పడుతుందా ?" "ఆ. తప్పకుండా కోప్పడుతుంది. ఎన్నడూ ఇంక అట్లు చెయ్యదు. నవ్వదు. మాట్లాడదు. మన మొహం చూడదు. అయినా రూపాయికి ఎవడు పారేస్తాడు? ఒట్టి పీనిక్కి పది రూపాయలు తీసుకుంటాడే" అన్నాను.

వాసన ఇల్లంతా వ్యాపించింది. పెద్దమ్మాయికి విరోచనాలు; అబ్బాయికి జ్వరం; చిన్నపిల్లకి పొంగు మా చెల్లెలికి ఆరోనెలలోనే నెప్పులు. ఏం చెయ్యం? ఎవరితో చెప్పకండా ఇల్లు తాళంవేసి, సత్రానికి పోయాము.

ఇన్నాళ్ళు మా బావ వూళ్ళోలేడు. మేము సత్రానికెళ్ళిన మర్నాడు వూళ్ళోదిగి ఇల్లు తాళం వేసుంటే మమ్మల్ని వెతుక్కుంటూ వొచ్చాడు. అతని వెనకాల పెద్ద గుంపు. చుట్టుపక్కల వాళ్ళందరూ "ఇళ్ళు తెరుస్తారా లేదా? లోపల నూరుకూనీలన్నా జరిగాయి. మరియాదస్తులనుకున్నాము. సత్రానికొస్తే దాగుతుందా !" అని ఒకటే

అరుపులు మునిసిపాలిటీవారు ఇల్లు తగలపెట్టటానికి సిద్ధంగా ఉన్నారు. ఏ
చెయ్యం? జబ్బు పిల్లల్నేసుకొని వెనకాలి వెళ్ళాము.

అర్ధరాత్రి నేనూ మా బావా మూతులకి, గుడ్డలు కట్టుకుని, ఒక సెంటు మీద గుమ్మరించుకుని ఆ తప్పాల బుజాలమీద మోసుకుంటూ, గోదావరి బయలుదేరాం. నిద్దర్లో మనుషులు కలవరించారు, కేకలు పెట్టారు. తొందరగా శేషయ్య మెట్టదగ్గిర నావ తీసుకుని నీళ్ళ మధ్యకుపోయి గిన్నెపాళంగా గోదావరి పడేశాం. నీళ్ళల్లోపిండి పారపోసి గిన్నె తెచ్చుకోవాలని బుద్ధి పుట్టింది. కాని మూత లోపలినించి ఏ మొస్తుందో, ఏదన్నా విషజంతువు బయలుదేరుతుందేమో అ భయమేసింది. రెండురోజుల్లో శేషయ్యమెట్ట గుమ్మెత్తి పోయింది. ఒక్కరూ నీ ముంచుకోరు. ఏదో చాలా వుపద్రవం రాబోతుందని వూళ్లో పుకారు. రైలు బ్రిడ్జీమీ రూల్సుకి వ్యతిరేకంగా, ముప్పై మైళ్ళ వేగంతో పోతూంది. పెద్ద పెద్ద చేపలు చ తేలుతున్నాయి. కాని ఒక్కరూ వాటిని ముట్టుకోరు. గోదావరిదాటే పిట్టలు గిర తిరిగి నీళ్ళల్లో పడుతున్నాయి. చివరికి పడవలూ వలలూ వేసుకుని, గోదావరిలో గిన్నెనిపట్టి బయటికితీశారు. యెట్టా కనుక్కున్నారో, ఏమో, హాయిగా నిద్రపోతు ఇంటిల్లిపాదికి అర్ధరాత్రి హటాత్తుగా మెలుకువ వొచ్చింది. వూపిరి పీలవడం అసాధ్య తంటాలు పడ్డాం, వెంటనే లేచి లాంతర్లు వెలిగించి ఆ వుపద్రవం ఏమిటని వెది అరుగుమీద ఆ గిన్నెవుంది. వెంటనే ఆ గిన్నెని తీసికెళ్ళి వూరిబయట దూరం స్మశానంలో, నిలవులోతున గుంటతీసి పాతి పెట్టించాము. మర్నాటికి కలెక్ట చైర్మనులకీ పెద్దమాన్స్టరు అర్జీలు వెళ్ళాయి. వాసనకి దెయ్యాలన్నీ లేచి స్మశానంలోం వూళ్లోకి బయలు దేరాయట. మునిసిపాలిటీవారు మమ్మల్ని బలవంతం చే ప్రాసిక్యూషన్ చేస్తామని బెదిరించి , ఆ గిన్నె తవ్వించారు చివరికి ఒక మంచి సం ఆలోచించాము. అనంతపురంలో మేము ఒకరికి అయిదువేలు బాకీ. ఆయనకే దీన్ని బంగీకట్టి పోస్టాపీసుకు తీసికెళ్లాము. యిరవయి రూపాయలు లంచమిస్తేగా ఆ గుమస్తా బంగీ తీసుకోలా. ఆ రోజు మధ్యాహ్నం నుంచి పోస్టాఫీసుకి సెలవు సాయంత్రం రైలు గోదావరి స్టేషన్కి అరమైలు ముందే ఆగింది. మరతిప్పినా ఇంజ కదలలేదు. చివరికి యేం చేశారో తెలియదు. వార్తా పత్రికల్లో మాత్రం యెన్నడూ లేనిది అనంతపురంలో ప్లేగు మొదలు పెట్టిందని చదివాము. ఆయన ఇంతవరకు అప్పుకోసం అడగలేదు. ఆయనకి ఆరుగురు కొడుకులూ పదిమంది మనవలు వున్నారు. వాళ్ళెవరూ ఇంతవరకు మాకు వుత్తరం రాయలేదు.

* * *

# అభినవ సారంగధరుడు

అది యింకా టాకీలూ, విమాన టపాలూ, నాలుగైదు తెలుగు పత్రికలూ కూడా అట్టే లేనికాలం.

పురుషోత్తం రాత్రి ఏడింటికి పాసంజర్‌లోంచి సెంట్రల్ స్టేషనులో దిగాడు. తనకోసం బండి పంపమని వకీలు శంకర్రావుకి రాశాడు. పంపాడో, లేదో!

"తమరేనా, పురుషోత్తంగారు?....దయచెయ్యండి."

అతన్నీ సామానునీ పెద్దమోటారులో యెక్కించి తీసుకుపోయినారు.

"శంకర్రావు మోటారుకూడా కొన్నాడా? ఈ పట్నం ప్లీడర్లకి యెంతలో ప్రాక్టీసు వొస్తుందో? ఆ మామ గాడ్దెకొడుకు ఓ వెయ్యి ఇచ్చి వుంటే నేనూ ఇక్కడే బల్లకట్టి, ఈ పాటికి సొంత మోటారులో తిరుగుతూ వుందునుకదా!" అనుకుంటున్నాడు. తరవాత శంకర్రావుతో మాట్లాడ వలసిన కేసు పాయింట్లు జ్ఞాపకం తెచ్చుకున్నాడు. "ఈ పట్నం వకీళ్ళకి, మఫిలు ప్లీడర్లకి తెలివి ఎక్కువలేదని" అతనే వుద్దేశ్యం.

ఎక్కడికి పోతోంది యీ మోటారు.

"ఏయ్, ఇదేమిటి? మైలాపూరుకు వెళ్ళాలి."

"శంకర్రావుగారు కీల్‌పాక్‌కి మారారండి."

"ఆహా!"

పెద్దగేటులోంచి, తోటదాటి, గొప్పభవనం దగ్గిరికి పోతోంది బండి. ఇల్లంతా దీపాల విభవంతో వేలుగుతోంది.

ఇది శంకర్రావు ఇల్లా తప్పు యెడ్రెస్‌కి రాలేదుకదా? కాని కారు వాడికి తెలీదా?

"శంకర్రావుగారి యిల్లేనా?"

"అవునండి. ఆయనకి డర్బీస్వీప్ వొచ్చింది తెలీదా తమకు!"

"ఆహా, వాడు రాయనేలేదే?"

పురుషోత్తం యీర్ష్య తగ్గింది. వకీలువృత్తిలో సంపాయించాడను కున్నంత బాధలేదు. బండీ ఆగింది.

"దయచెయ్యండి."

"సామానుల్నీ, ఆయన్ని ఒక గొప్ప గదిలో కూచోపెట్టారు.

"ఫలహారం కావాలా?"

"శంకర్రా వేడీ."

"వెడదాం పైకి. ముందు టీ తీసుకోండి. భోజనానికి ఆలస్యముంది"

"ఫలహారం చేస్తూ ఉండగా, ఒకడు చంకీకోటూ లాగూ, జరీ తలపా
చమ్కీచడావులూ, బనారసు కండువా తీసుకొచ్చాడు.

శంకర్రావు యెదురు వొస్తాడనుకున్న పురుషోత్తం "ధనంతో యి
గర్వమెక్కుతుందా" అనుకుంటున్నాడు.

"ఇవి వేసుకోండి."

"అదేమిటి?"

"ఇక్కడ అతిధులకి యివి ధరించడానికి ఇవ్వడం మామూలు. ఈ బట్టలు వేసుకు
గాని ఆయన్ని దర్శించడానికి వీలులేదు."

డర్బీస్వీపుతో శంకర్రావుకి మతిపోయిందనుకున్నాడు.

"నా కిష్టంలేదు, వేసుకోను. వాణ్ణి ఒక్కసారి రమ్మనండి; కనుక్కుంటాను".

"ఇవి వేసుకోంది కనపడరు, తరవాత ఆయనతో మాట్టాడి ఆయన వొప్పుకు
తీసివెయ్యండి."

"వాడితో చెప్పారా నేను వొచ్చానని?"

"వారే పంపారు యివియేరి మీకు".

ఏం చేస్తాడు? వేసుకున్నాడు. ముందు పెద్ద అద్దముంది. తన వేషం చూసుకున్నా
పురుషోత్తం చాలా అందమైన మనిషి. తెల్లగా, పాలుకారే చర్మం, యెర్రని పెదవులు, 
మీసాలు, ఆ దుస్తులు వేసుకుని చూసుకుంటే, యే పురాతన రాజకుమారుడి
వున్నాడు. అతనికా డ్రస్సు మీద ప్రేమ కలిగింది. ఆ వేషంతో కోర్టుకి వెడితే, యే జడ్జీ
కేసు ఎదటి పక్షం చెయ్యగలడా?

"రండి"

మేడమీదికి వెళ్ళారు.

"అదే వారిగది. లోపలికి వెళ్ళండి" అన్నారు.

తలుపు తెరిస్తే, లోపలంతా చీకటి. కాని ఒక్క నిముషంలో గప్పుమని
ముట్టుకున్నట్టయింది. గోడలోంచి, కప్పులోంచి, కింద నేలనించి అనేక దీపాలు వెలిగా
పంకాలుగావును బుయ్యిమనే శబ్దం చేస్తున్నాయి. ఫానులుగానీ దీపాలుగానీ కనపడకు
లోపలే అమర్చారు. గది అద్భుతంగా అలంకరించి ఉంది మొహమల్ కుర్చీలూ, సోఫాల
పటాలూ- వెండి దీపపు సెమెహ్మెయలూ, తివాసీలూ, పాన్లానూ, ఫలమాజాలూ చక్కని పళ్ళా
కాని అన్నీ పురాతనపు "ఫాషన్". ఏదో రాజు పడక గదివలె ఉంది. ఆశ్చర్యంతో చూస్తున్నా
దూరంగా వెనగ్గావున్న పెద్ద హంస తులికా పాన్పుమీద, చాలా అందమైన స్త్రీ పడుకునే ఉం
శంకర్రావు యీ వేషం వేసుకున్నాడు గావును. పురుషోత్తాన్ని చూడగానే, ఆమె చప్పున
దూకి సంతోషంతో ఎరిగినదానివలె, చిరునవ్వుతో ఒస్తోంది. కలా? మాయా? ఆమె పురాతన
నగలను, బావిలీలూ, బుజబందులూ పెట్టుకుంది. రవికలేదు, పమిటాలేదు. రొమ్ముకి
పట్టుబట్ట చుట్టుకుంది. కింద చీనీల పావడ-మార్వాడీ దానివలె. ఆమె అతన్ని సమీపిస్తో

"రా యీ దీనురాలి మందిరాన్ని నీ అపార సుందర దృష్టులతో తేజరిల జేయనా
వొచ్చావా? రా ఇట్లా కూచ్చో" అంది. అంటూ చేతులు పట్టుకుని కూచోపెట్టి పక్క
కూచుంది. ఫలహారాలు తినమని పెట్టింది. క్రమంగా అతనిమీద కళ్ళలో అమితంగా మోహ
చూపసాగింది. వేళ్ళు తాకడమూ, అతని వుత్తరీయాన్ని ముద్దు చెయ్యడమూ, న
గంధము రాయడమూ, తాంబూలము నోటి కందివ్వడమూ సాగించింది. "రా నా మే
చూద్దుగాని" అంటూ పాట పాడుతోంది. నవ్వుతుంది. చెయ్యిపట్టుకు లాగుతుంది.
చర్యలుగమనించి అతనికి భయమూ, వెగటూ తోచి వెళ్ళిపోవాలని చూస్తున్నాడు.



వాళ్ళ వూళ్ళో పురుషోత్తానికి అభినవ సారంగధరుడని పేరు. అతని సవితి తల్లితో నిజంగా సారంగధర నాటకం జరిగిందని ప్రతీతి. అతని తండ్రిమాత్రం అతన్ని ఇంట్లోంచి పంపించి, ఆస్తి వేరే వాళ్ళకి విల్లు చేసినమాట నిజం. నీతి గురించీ, దేశంలో ప్రబలుతున్న అవినీతిని గూర్చి, ప్రాచీనకాలపు నియమాల్ని గూర్చీ, సంసార పారిశుద్ధ్యాన్ని గూర్చి అతను విరివిగా వుపన్యాసాల్ని ప్రచారం చేశాడు. అదిగాక, తన స్వీయ చరిత్రలో, తన ఏకపత్నీ వ్రతాన్ని ఆదర్శమని ప్రజలకి చాటాడు.

ఇప్పుడీ పరస్త్రీ తననట్లా సమీపిస్తే అతనికి కోపం ఒచ్చింది. ఆమె నించి తప్పించుకోవాలని యిటూ అటూ వెళ్ళాడు. ఆమె ఏదో మిషతో అతని వెంట తిరుగుతోంది. అతనడిగిన ప్రశ్నల్ని "ఇదేమిటి? శంకర్రావేడి? నువ్వెవరు?" అంటే వినిపించుకోదు. పైగా తనని, "సారంగా, సారంగా" అని పిలుస్తుంది.

"ఇదేమన్నా పిచ్చిదేమో" అనుకున్నాడు. తన నేమన్నా చేస్తే! మెల్లగా తలుపు దగ్గిరికి వెళ్ళి, తెరవపోయినాడు. రాదు.

అతనికి భయం పుట్టింది. ఇటూ అటూ వెళ్ళాడు, అరిచాడు. ఆమె అతన్ని ఒకమూల ఇరికించి, తన మోహాన్ని వెల్లడి చేసింది. అతను లేకపోతే బతకలేనంది. కోపంతో తోసేశాడు.

"నువ్వు నన్ను నిరాకరిస్తే ఎట్లా బతకను? కొంచమైనా కనికరం లేదా? నా యౌవనాన్ని నా అందాన్ని చూడు. ఆ ముసలి మొగుడితో యెట్లా ప్రేమే ననుభవించను? నేను నీదాన్ని. తీసుకో" అని అతని మీద పడ్డది. అతను దూరంగా వెళ్ళిచూశాడు. ఆమె దిగులుగా చూస్తోనుంచుంది. ఆమె చూపులు చాలా గాఢంగా, మన్మథోద్దీపనాలుగా వున్నాయి.

ఆమె శంకర్రావు భార్యా? లేక వుంపుడుకత్తా? తనని పొరబాటున శంకర్రావు పడకగదిలోకి ప్రవేశపెట్టారు గావును! కాని శంకర్రావు ఏమీ ముసిలివాడు కాదే! తన జాలిని రేపడానికి అట్లా అంటోందేమో! ఆ ముసలి వాడు తనని పెట్టే బాధలు చెపుతోంది. "వాడు యింట్లో లేడు, రాడు, భయం వొద్దంటోంది."

అతని వెంట పరిగెత్తడంతో ఆమె జుట్టు వూడిపోయింది. ఉత్తరీయం కిందపడ్డది. ఆయాసంతో ఆమె పీనస్తనం లేచి పడుతోంది, యెత్తుగా, లోతుగా!

"ఇంక యెక్కడికి పోతావు?" అంటూ అతన్ని కావలించుకొని ముఖమెత్తింది. అతను తోసేస్తున్నాడు. కాని యెవరూలేరు. ఎరగనివూరు తానొక్కసారి అనుభవించినా యెవరికి తెలిసే భయంలేదు. అందులో అప్రయత్నంగా అతనిపాప బోధనలేకుండా, మీదికి ఒచ్చి బలవంతం చేస్తోంది. అతని తప్పిదం స్వల్పం. మరి అట్లాంటి పరిస్థితులలో, కొత్త స్థలంలో, మరి ఆమె మాట వినకపోతే తనకేమి ఆపదరా పోతోందో? ప్రాణం మీదికే వొచ్చినప్పుడు యింక నీచమైన పనికాని చెయ్యవలసిందే- అని అతని మనసు ఆలోచిస్తోంది. ఆమె రంగు చూడు, ఆమె చేతులు నునుపు చూడు, అంటున్నాయి కళ్ళు. ఒకసారి ఆమెని, పాపం అట్లా ప్రాధేయపడుతోందే, కావిలించుకో. ఆ పట్టుపాన్పుమీద, యీ దివ్య భవనంలో యెటువంటి ఆనందం అనుభవించగలవు! మళ్ళీ నీ కిట్లాంటి "ఛాన్సు" నాలుగు జన్మాలకైన దొరుకుతుందా? అంటున్నాయి చేతులు."

ఆమె వూపిరి, అతని మొహంమీద తగులుతోంది. ఆమె రొమ్ము అతని రొమ్ముకి అనుకొని వెనక్కి వొంచింది.

పురుషోత్తం దగ్గిరగా చూసినవాళ్ళల్లా దాసీవాళ్ళూ, వితంతు ముసలాళ్ళూ, భార్యా. ప్రజాభయంవల్ల అందమైన స్త్రీ అని తోచగానే కళ్ళు కిందికివాల్చినడిచాడు. అందువలనే అతని కింత వరకు ఎప్పుడూ మన్మథ వికారం కలుగలేదు. ఇంత అందమైన స్త్రీని ఇంతదగ్గిరిగా కలుసుకోలేదు. అందువల్లనే అతనికి నీతి మార్గం సులభమయింది. అతనెన్నడూ భయపడే విషయాలు, ఇతరులకి తెలీడం, అవుమర్యాదా, ఇక్కడ వున్నట్టులేవు. ఆమెని గట్టిగా

కావిలించుకుని, రవికని లాగేశాడు. అతనికి పూర్వానుభవం లేకపోవడంవల్ల పరస్త్రీతో ఏ
మృదువుగా వ్యవహరించాలో తెలీదు.

"ఇదేమిటీ?" అని ఆశ్చర్యంతో చూసిందామె.

బైటనించి "కట్ఆఫ్" అనే కేక వినపబడ్డది. తలుపులు తెరుచుకుని మనుష్యు
వొచ్చారు. అదంతా చాలా అన్యాయంగా కనపడ్డది పురుషోత్తానికి. ఆమెని అయిష్ట
వొదిలి, వాళ్ళవేపు తెల్లబోయి చూస్తున్నాడు. రహస్యంగా, యెవరికీ తెలీకుండా తన నియ
చెడకుండా స్త్రీ దొరికిందనుకుంటూ వుంటే యిదేమి అన్యాయం?

"ఏం పని చేశారండీ! ఎంత నమ్మాము మిమ్మల్ని? సీనంతా తగలపడ్డది"

"ఏమిటి?"

"ఏమిటేమిటి?మీ పేరు అభినవ సారంగదరు డవునా కాదా?"

"ఎవరో కొందరట్లా నవ్వులాటాల కంటారు. ఐతే?"

"మీరు నీతి గురించి వుపన్యాసా లిచ్చారా లేదా?"

"ఇచ్చాను."

"మరి యిదేం పని?"

"ఎవరు యీమె?"

"ఈమా? చిత్రాంగి. ఎంత వెతికినా సరిగా నటించగల సారంగధరుడు దొరకలే
మా ఫిల్ముకి. ఎవడిని తీసుకొచ్చినా "ఛీ, ఛీ! పాపం. తల్లిని నన్ను తాకకు" అంటూ
చిత్రాంగి వేంక మోహంతో చూసి, ఫిల్ము పాడు చేశారు. మరి మా చిత్రాంగిని అద
సౌందర్యరాశిని సంపాదించాము. ఈ కాలంలో నటనకైనా వైరాగ్యం కనపరిచే మనిషి లేరు

ఒక శాస్త్రులుగారిని తీసికొస్తే, ఆయన మా చిత్రాంగి పక్క మీద నించి లేవకము
మీద పడ్డాడు. నలుగురం పట్టుకుని లాగినా ఒదలడే! ప్రతివాడూ నీతిశాస్త్రాలు యేకరు
పెట్టేవాడేగాని, అనుష్టించేవాడు ఒక్కడూ లేడే! చివరికి, మీ కీర్తివిని, అభినవ సారంగధరుల

"అవును కాని మా సవతి తల్లికి అందమెక్కడిది, యౌవనం తప్ప-"

"మీరేదో వొరిగిస్తారని-మీ ఉపన్యాసాలు కూడా చదివాము. ప్రతి స్త్రీకి లొంగిపో
అనేకులు చెపితే నమ్మి, వ్యయ ప్రయాసల కోర్చి మోసంచేసి మిమ్మల్ని తీసుకొస్తే, ఇదే
పని స్వామీ? ఎంత నమ్మించారండీ!"

"ముందే చెప్పకూడదు?"

"నటకులు కాదుకదా? చాతవుతుందో కాదో? సహజంగా మీ ముఖంలో భయమ
విరక్తి కనపరుస్తారనుకున్నాము. చూడండి. గది ప్రతిమూలా "కెమెరాలు" ఏర్పాటు చేసా
వృధా వృధా! పోనింది గాని, ఇన్నాళ్ళు మీరు నీతి విషయంలో పని చేస్తున్నారు. మీ
శిష్యులు అనేక మంచి యువకులున్నారట-మా చిత్రాంగిని మోహంతో చూడకుండా నటిం
ఆయన్ని చెపుతారా?"

"లాభంలేదు. మొగాణ్నిగాని కురూపినిగాని తీసుకురండి....చిత్రాంగి వెయ్యరాని
సరే నేను పోతాను. కాని ఈ సంగతియెక్కడా తెలియ చేయకండి. తెలియచేశారా, అద
నిర్భంధానికై నేను మిమ్మల్ని కోర్టుకు లాగుతాను."

అని వెళ్ళిపోయినాడు సారంగధరుడు.

★ ★ ★